

క్రుషీవల దంపతులు

—చిత్రకారుడు: పి. ఆర్. రాజు—మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సంపుటము 40
సంచిక 31
4-4-56

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

మన్మథ ఫాల్గుణ బహుళ నవమి బుధవారం

శ్వేతజాతి

ఫొటో: ఎ. వి. వి. నరసింగరావు—రాజమండ్రి.

# విషయానుక్రమణిక




బడ్జెట్ బయట పడడం పై చెలరేగిన గందరగోళం నుంచి ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ సురక్షితంగా బయట పడ్డారు. ఆయన ఎంతకాలం సురక్షితంగా ఉంటారనేది ఆలోచించ దగిన విషయమే. వార్తాపత్రికల్లో పడేవార్తలను బట్టి వ్యాపారస్థులందరూ శ్రీ దేశ్‌ముఖ్ కేవలం తమకు వ్యతిరేకి అవుతున్నారని భావిస్తున్నట్లు తెలుస్తోంది. గాంధీ తత్వాన్ని, కాంగ్రెసు సిద్ధాంతాల్ని అడ్డం పెట్టుకుని పెద్దపెద్ద పెట్టుబడిదార్లను వెనకేసుకుని వచ్చే ఒక వార్తా పత్రిక ఈ వాదు వేసింది. జీవిత భీమావ్యాపారాన్ని జాతీయం చేయకుండా ఉంటే పండిట్ నెహ్రూ తరవాత శ్రీ దేశ్‌ముఖ్‌ను ప్రధాన మంత్రిగా వ్యాపారస్థుల వర్గం ఎన్నుకొని ఉండేదట. ఈ వర్గానికి కృతఘ్నుడైనందుకు శ్రీ దేశ్‌ముఖ్ కొన్ని ఇబ్బందులకు లోనుగాక తప్పదు. ఈసారి ఆర్థికమంత్రి పదవికి కీ. శే. జమ్నాలాల్ బజాజ్ అల్లుడైన శ్రీ శ్రీమన్నారాయణ్‌ను పారిశ్రామిక వర్గంవారు సూచిస్తున్నట్లు కూడా తెలుస్తోంది. ఒక పారిశ్రామిక ప్రముఖుడు కాంగ్రెసుపార్టీ మనిషినే భారత ఆర్థిక మంత్రిగా నియమించాలని హోమ్ మంత్రికి సూచించారట.

శ్రీ శ్రీమన్నారాయణ్ అ. భా. కాం. సంఘంవారి ఆర్థిక విషయిక వార పత్రికకు ముఖ్య సంపాదకుడు. ఆ పత్రిక జనవరి సంచికలో సంపాదకుడు హెచ్. డి. మాలవీయ ఇలా వ్రాశారు:

శ్రీకృష్ణ
(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

"భీమా వ్యాపారం బ్లాక్ మార్కెట్ వ్యాపారంగా తయారైంది. వ్యాపారస్థులు దాని ద్వారా ఏడాదికి రెండుకోట్ల రూపాయలదాకా అక్రమ ఆదాయం ఆర్జించారు. 1988 సం॥పు భీమా శాసనం ఇప్పటికి పది సార్లు సవరణ చేయబడింది. ప్రతి సవరణా ఈ వ్యాపారాన్ని అదుపు చేయడానికే ఉద్దేశించబడింది. ఇదికాక 1955లో కొన్ని నిబంధనలు ఏర్పాటయ్యాయి. ఈ నిబంధనలను కూడా చాలసార్లు సవరించారు. కాని ఈ శాసనాలు, సవరణలూ భీమావ్యాపారంలోని అవినీతిని ఏమాత్రం అరికటలేక పోయాయి. పైగా పరిస్థితి మరీ పాడైంది."

భీమా వ్యాపారాన్ని జాతీయం చేయడానికి పండిట్ హెచ్. డి. మాలవీయ సూచించిన మార్గాన్నే శ్రీ దేశ్‌ముఖ్ చాల వరకు అవలంబించారు. శ్రీ శ్రీమన్నా

ఆంధ్ర రైతులు 400 మంది ప్రత్యేక రైలులో నవభారత సందర్శనం చేస్తూ ఢిల్లీలో శ్రీ నెహ్రూను కలుసుకొని, పంచవర్ష ప్రణాళికా నిధికి వెయ్యినూట పదహార్లు సమర్పించారు.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

రాయణ్ కూడా కాంగ్రెసు వారపత్రిక మార్చి సంచికలో ఇలా వ్రాశారు:

"సర్వోదయ భావాన్ని ఇప్పటి ఆర్థిక పరిభాషలోకి అనువదించాలంటే, ముఖ్యమైన పరిశ్రమలను జాతి క్షేమంకోసం జాతీయం చేయడమని అర్థం చెప్పకోవాలి. భారతదేశంలో పటిష్ఠమైన ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పాలంటే, ఈ ముఖ్య పరిశ్రమలను వ్యక్తుల చేతుల్లో విడిచి పెట్టి ఊరుకోరాదు. వస్తూత్పత్తి పరిశ్రమలలో కూడా చాలా వాటిని వికేంద్రీకరించి సహకార పరిశ్రమలుగా ఏర్పాటు చేయాలి. ఇలా వికేంద్రీకరించడం వలన సంఘాన్ని ఆర్థికంగా దోచుకోవడానికి వీలులేని పద్ధతిలో ప్రైవేటు పారిశ్రామికులకు అవకాశాలను కలుగజేసినట్లవుతుంది."

శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ అంటే వ్యాపారస్థులకు ఇష్టం లేక పోవడానికీ, శ్రీ శ్రీమన్నారాయణ్ అంటే మోజు కలగడానికి ఒక కారణం చెప్పవచ్చు. మాటలకూ చేతలకూ తేడా చాలా ఉంది. సోషలిస్టు వ్యవస్థను గూర్చి, సర్వోదయ భావాలను గూర్చి ఎన్ని తీర్మానాలను, చర్చలను జరిపినా అది ఆచరణలోకి రానంతకాలం పారిశ్రామిక వర్గస్థులు ఏమీ పట్టించుకోరని స్థానిక వార్తాపత్రిక రాతలనుబట్టి తెల్లమవుతోంది. వాణిజ్య శాఖామంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి ఇటీవల అన్నట్లు, అంబర్ చర్ఖా మీద ఊరేగే సర్వోదయ సిద్ధాంతం భారత పారిశ్రామికులకు నచ్చింది. దేశంలో జీవనస్థాయి పెరుగుతోంది. నిత్య జీవితావసర వస్తువులకు గిరాకీ హెచ్చుతోంది. కనుక ఈ వస్తూత్పత్తిని పరిమితం చేస్తే పారిశ్రామికులకు అధిక లాభాలు లభిస్తాయన్న మాట. అలా పరిమితం చేయడమే జరిగితే, ధరలు పెరగడం, తద్వారా ద్రవ్యోల్బణం అధిక కావడం జరుగుతుంది. పారిశ్రామికులకు ఇదీ లాభకరమే.

అందుచేతనే కాబోలు ఒకానొక వార్తాపత్రిక ముందు అంబర్ చర్ఖాను ఘాటుగా విమర్శించి, తరవాత అంబర్ చర్ఖాను విమర్శించిన వాణిజ్య మంత్రినికూడా ఘాటుగా విమర్శించింది. అంబర్ చర్ఖాను విమర్శించడం ఉక్రోషం పట్టలేకనే కావచ్చు. వాణిజ్యమంత్రిని విమర్శించడం మాత్రం ప్రజలనుమాయచేయడానికే అయివుంటుంది.

శ్రీ దేశ్‌ముఖ్‌ను పారిశ్రామిక వర్గం వెలివేసినట్లే భావించవచ్చును. కాంగ్రెస్ నేతలు, నేతులవలె కాకుండా ఆయన సిద్ధాంతాలను ఆచరణలో కూడా పెడుతున్నాడు. నిజానికి సోషలిస్టు వ్యవస్థను రూపొందించే ఘనతలో కొంత ఆయనదీ, కీ. శే. కిద్వాయ్‌దీ. శ్రీ దేశ్‌ముఖ్ ఇంపీరియల్ బ్యాంకిని, బీమా వ్యాపారాన్ని జాతీయంచేశారు. పన్నుల విధానం ద్వారా కంపెనీల చట్టాన్ని సవరించడం ద్వారా సోషలిస్టు వ్యవస్థకు పునాదులు వేశారు. కీ. శే. కిద్వాయ్ విమాన మార్గాలను జాతీయం చేశారు. ఆయన విధానాన్నే ప్రస్తుత రవాణా శాఖమంత్రి కొనసాగిస్తున్నారు. ఆహారశాఖా మంత్రిగా కిద్వాయ్ పంచదార పరిశ్రమలాభాల్లో పారిశ్రామికులకు, చెరకు పంటదారులకూ వాటాలను నిర్ణయించారు. మిగతా వారంతా సోషలిస్టు వ్యవస్థ జెండా ఎగరెయ్యడం తప్ప, చేసేది ప్రైవేటు వ్యాపారస్థులను బలపరచడమే. ఉదాహరణకు వ్యక్తి స్వరంగంలో నౌకా వాణిజ్యాన్ని అభివృద్ధి చేయడానికి భారతప్రభుత్వం 20½ కోట్ల రూ.లు స్వల్ప వడ్డీతో ఋణం ఇచ్చింది. ఈ ఋణం పుచ్చుకున్న కంపెనీలు నూటికి 6 వంతుల లెక్కన లాభాలు తీస్తున్నాయి.

సోషలిస్టు నినాదాలు చేసే కాంగ్రెసు మంత్రులు నౌకా పరిశ్రమను జాతీయంచేయ నిరాకరిస్తున్నారు. అందుచేతనే వీరిని పెట్టుబడిదార్లు సహించి ఊరుకుంటున్నారు.

*　　*　　*

మౌలానా అబుల్ కలాం ఆజాద్ ఈమధ్య పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగించారు. ఈ ప్రసంగం మన ప్రజాస్వామ్యానికి మచ్చుతునక.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణసంఘ నివేదిక ఆచరణ సంఘంలో మౌలానా సాహెబ్

సభ్యులు. మిగతా ఇద్దరు సభ్యులు ప్రధాని నెహ్రూ, శ్రీ గోవిందవల్లభపంత్. ప్రైప్రసంగ సందర్భంలో మౌలానా బొంబాయి భవిష్యత్తుగూర్చి కొన్ని అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఈ అభిప్రాయాలు వెలిబుచ్చ

**ఊహ మంచిదే!**

శాసనసభ్యులకు శాశ్వతంగా జీవనోపాధి కలిగించాలంటే ఒక్కొక్కరికి ఒక్కొక్క బస్సురూటు 'మంజూరు' చెయ్యాలి. ఆంధ్ర శాసనసభలో, శ్రీ పి. గున్నయ్య ఇటీవల ఈ సూచన చేశారు. ఇలాచేస్తే తమ నెలజీతం రు. 150 వదులుకోవడానికి సిద్ధమేనని కూడా ఆయన చెప్పారు.

వచ్చునని ఆయనకు ఆచరణ సంఘం అను మతి ఇచ్చిందా అని ప్రశ్న. న్యాయంగా ఆ సంఘ అధ్యక్షుడైన ప్రధాని నెహ్రూ ఆ ప్రకటనచేసి ఉండవలసింది.

* * *

హిమాచల ప్రదేశ్‌ను విడిగా ఉంచడంలో కృతార్థులైన డా॥ పార్మార్, ఆయన అనుయాయులు తమ అధికారం నిలబెట్టుకోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. చెప్పలేము, ఆయన ఈ సారికూడా కృతార్థుడు కావచ్చు.

* * *

కేంద్ర మంత్రివర్గంలో మార్పులు జరుగుతాయని లాబీవర్గాలలో బయల్దేరిన కలకలం అణగిపోయింది. పెద్దమార్పు లేమీ రావని సూచనలు కనిపిస్తున్నాయి కాని సౌరాష్ట్ర నుండి ఎమ్. ఎమ్. షా, పశ్చిమ బెంగాల్ నుండి హుమయూన్ కబీర్ మంత్రివర్గంలో చేర్చుకోబడే అవకాశం లేకపోలేదు. సౌరాష్ట్ర ఆర్థికమంత్రి వాణిజ్య, పారిశ్రామిక శాఖలో చేరుతున్నారు. శ్రీ హుమయూన్ కబీర్‌కి ఏశాఖ లభిస్తుందనేది ఇంకా తేలలేదు. బహుశా విద్యాశాఖలో నే చేరవచ్చు. ఇంతవరకూ శ్రీ కబీర్ విద్యాశాఖ ఉపమంత్రి శ్రీ శ్రీమాలి క్రింద ఉద్యోగిగా పనిచేశారు. ఇకముందు శ్రీ శ్రీమాగారే కబీర్ గారి క్రింద పనిచేయవలసి రావచ్చును.

అస్సాం గవర్నరుమార్పు వాయిదా పడింది. శ్రీ కె. సి. రెడ్డి ఉత్పత్తిశాఖ మంత్రిగానే ఉంటారు.

ఒక స్థానిక వార్తాపత్రిక రాసినదాన్నిబట్టి, కేంద్ర మంత్రివర్గశాఖ. ఒకదాన్లో ఉద్యోగుల సంఖ్య 1947 లో 10 నుంచి 1956 లో 1000 వరకూ పెరిగింది. ఒకా ఇది ఆరోగ్యశాఖ అయివుండవచ్చును. ఈ లెక్కన విద్యాశాఖ నిర్వహించేయనకు పద్మభూషణ బిరుదు ఇవ్వాలండే. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి ల ప్రకారం జనవరిలో దరఖాస్తులుపెట్టుకున్న వారి సంఖ్య 5,588. వీరిలో 1108 మంది ఢిల్లీవారే. 1955 నవంబరుతో ఆఖరైన సంవత్సరంలో కేంద్రప్రభుత్వ గుమాస్తాలసంఖ్య 1,91,802 వరకు పెరిగింది. అంటే 27,735 మందికి కొత్తగా ఉద్యోగాలు లభించాయన్నమాట. కేంద్ర ప్రభుత్వం క్రింద నిజంగా ఎక్కువయింది 14,702 మంది మాత్రమే. అంటేపుణులయిన ఉద్యోగుల సంఖ్య, నిపుణులుకాని వారి సంఖ్య తగ్గిపోతుండగా పై ఉద్యోగుల సంఖ్య పెరుగుతోందన్నమాట. ఆర్థికశాఖ, హోంశాఖ తాలూకు పొదుపుసంఘం ఏంచేస్తోందో దేవుడికెరుక. ★

# కవిచక్రవర్తి

## ప్రాచీన గాథాలహరి

పి. గణపతి శాస్త్రి

[గత సంచిక తరవాయి]

గృహిణీమరణంతో మాతృగుప్తునికి వజ్రాఘాతం తగిలినట్లయింది. ఎంతో కాలం దాకా అతడా ఆ ఘాతంలోనించి కోలుకోనేలేదు. అయినా అతడా దుఃఖ భారం పైకి ఏమాత్రం వ్యక్తం కానీయలేదు. పైపైకి చాలా ఉల్లాసంగానే కనబడుతూండేవాడు. కాని లోలోపల ఆ శోకం ఆరని చిచ్చులా రగిలి అతని హృదయాంతరాళ జీవనాళాలు దహించివేసింది.

కాశ్మీర మహామాత్యుల కుటుంబాలకు సంబంధించిన బ్రాహ్మణులెందరో అతనికి తమ కన్యకల నిచ్చి వివాహం చెయ్యాలని ఉవ్విళ్లూరారు. ఆ ప్రస్తావన వచ్చినప్పుడు మాతృగుప్తుడొక్క నిట్టూర్పు విడిచేవాడు. ఆపైన మహామాత్యులిక ఆ ప్రయత్నంవల్ల లాభం లేదని ఆ విషయం విడిచిపెట్టి వేసేవారు.

మాతృగుప్తుని లోలోపల నిరంతరం ప్రవహించే శోకవాహిని అతనిహృదయానికొక అపూర్వమైన ఆర్ద్రత కలిగించింది. అతడు శ్రీనగరంలో ఎన్నెన్నో దేవతాగారాలు నిర్మింపజేశాడు. ప్రత్యేకంగా మాతృగుప్తేశ్వరాలయమనే మహేశ్వరాలయం నిర్మింపజేశాడని కల్హణ మహాకవి రాజతరంగిణిలో పేర్కొన్నాడు.

తమ పూర్వుల సంప్రదాయం ప్రకారం మాతృగుప్తునికొకమారు యజ్ఞం చెయ్యవలెనని సంకల్పం కలిగింది. యజ్ఞసంభారాలు సేకరించడం పూర్తి అయిపోయింది. అంతలో ఒకనాడు అతనికొక యజ్ఞపశువు దీనాక్రందనం వినిపించింది. వెంటనే ఆ యజ్ఞం నిలిపివేసి మిగిలిన యజ్ఞపశువుల నన్నింటినీ విడిచిపెట్టించివేశాడు. అంతేగాక కాశ్మీర రాజ్యంలో ఏ విధమైన జంతుహింసా జరగకూడదని నిషేధించాడు.

ఒకసారి హయగ్రీవవధ మహాకావ్యం రచించిన భర్తృమేంఠకవి అతని సందర్శనార్థమై వచ్చాడు.

అది చైత్రమాసం. సూర్యోదయకాంతులింకా రాజగృహద్వారంలో నిలిపిన సువర్ణ మంగళకలశాలపై ప్రతిఫలించలేదు. ఆ సమయంలో కాశ్మీర మహామాత్యునికి కూడా మాతృగుప్తచక్రవర్తి దర్శనం లభించదు. కాని మాతృగుప్తుడు మహాకవి, చక్రవర్తి అనే ఆశతో భర్తృమేంఠకవి ఆ సమయంలోనే అతనిదర్శనానికి వచ్చాడు. అతని ఆశ నిరాశకాలేదు. ద్వారపాలకులు కవి నామధేయం ఉచ్చరించగానే చక్రవర్తి తొందరతొందరగా తన అభ్యంతరమందిరంలోనించి సభాభవనంలోనికి వచ్చివేశాడు. భర్తృమేంఠకవి ఈ అపూర్వ గౌరవానికెంతో సంతోషించాడు.

కవి తన హయగ్రీవవధ మహాకావ్యం చదవడం ప్రారంభించాడు.

చక్రవర్తి అలాగే ఎంతో శ్రద్ధగా ఆ కావ్యం ఆలకించాడు. ఆ కావ్యపఠనం అలాగ పదిరోజులదాకా కొనసాగింది. మాతృగుప్త చక్రవర్తి ఆ కావ్యపఠనం జరుగుతున్నంతసేపు ఒక్కనాడు ఒక్క చిన్న చిరునవ్వైనా చిందించలేదు. అదంతా అలాగే తటస్థదృష్టితో విని ఊరుకున్నాడు. దానితో కవి హృదయంలో వెలిగేఆశాదీపం కాస్తా కొండెక్కిపోయింది. ఎలాగో అలాగ కావ్యపఠనం పూర్తిఅయింది. కవి తన భూర్జపత్రగ్రంథం విసుగుగా నేలమీద పడవేశాడు. చక్రవర్తి అది చూచి వెంటనే ఆ సమీపంలో ఉన్న బంగారుపళ్లెరం తీసుకువచ్చి అది అతిభద్రంగా ఆ పళ్ళెరంలో ఉంచాడు. దానితో భర్తృమేంఠునికి చక్రవర్తికా కావ్యంమీద కలిగిన మహాగౌరవం స్ఫురించింది. అతని ముఖం సువర్ణదర్పణంగాలా వికసించింది. తరవాత చక్రవర్తి ఆతనిని అపార ధనరాసులతో సత్కరించాడని వేరే వ్రాయ నక్కరలేదు గదా!

ఈ విధంగా కాశ్మీరంలో మాతృగుప్త చక్రవర్తి పరిపాలన మూడు నెలలు తక్కువగా అయిదుసంవత్సరాల ఒకరోజువరకు నిరంతరాయంగా కొనసాగిందని కల్హణుని రాజతరంగిణి పేర్కొంటున్నది.

అయితే ఆ అవధికి చాలా కాలానికి పూర్వమే ప్రవరసేనుడు తిరిగి కాశ్మీరానికి వచ్చివేశాడు. జీవితంపై తీవ్రవిరక్తితో అతడెన్నెన్నో పుణ్యక్షేత్రాలు సందర్శించాడు. ఆ విరక్తిలో అతనికి కాశ్మీరానికి తిరిగి రావాలనే అనిపించలేదు. తరవాత కర్ణాకర్ణిగా మాతృగుప్తుని పట్టాభిషేకవార్త తెలిసింది. దానితో అతని హృదయంలోని రక్తం అంతా ఒక్కసారిగా రెండు కళ్లల్లోకి ప్రవహించింది! పాలవంశ క్షత్రియవంశంలో అవతరించిన క్షత్రియ చక్రవర్తులు పరిపాలించే కాశ్మీర రాజ్యంలో ఒక బ్రాహ్మణ కవి పట్టాభిషిక్తుడైనాడు! కాశ్మీర రాజ్యానికీ, కాశ్మీర రాజవంశీయులకు అది ఎంతటి తలవొంపు! అనుకొన్నాడు ప్రవరసేనుడు! వెంటనే విక్రమాదిత్యుని నిర్మూలించి వేసి తదనంతరం కాశ్మీరరాజ్యం తిరిగి చేపట్టాలని అతడొక దృఢప్రతిజ్ఞపట్టాడు. మరుక్షణంలోనే తల్లితో కలిసి కాశ్మీర రాజ్యానికి వచ్చివేశాడు. కాని తనరాక ఎవరికీ తెలియనీయకుండా అతి రహస్యంగా దాచివేశాడు. అనతికాలంలోనే నిగూఢంగా శ్రీనగరంలో ప్రవేశించాడు. ఇద్దరుముగ్గురు వృద్ధ కాశ్మీర మంత్రులను రహస్యంగా కలుసుకొని మాచాయగా వారికి తన సంకల్పం తెలియజేశాడు. వారు శాయశక్తులా అతని ప్రతి నిర్వహణకు సాయపడగలమని వాగ్దానం చేశారు.

“మాతృగుప్తుడు సమర్థుడేనా?” అన్నాడు ప్రవరసేనుడు.

“మాకు మొట్టమొదట ఇలాగే శంకించాం. పోనుపోను వారి దక్షత విక్రమాదిత్య చక్రవర్తి శక్తిసామర్థ్యాలనుగూడా మించిపోయినదేమో అనిపించింది.” అన్నాడు మం.

“హాఁ! అలాగా!” “వారు కవిమాత్రులనుకోవడం కేవలం పొరబాటే!” అనడింకొక మంత్రి.

“బ్రాహ్మణ కవీశ్వరుని కింతటి శక్తిసామర్థ్యాలెలాగ కలిగాయో!”

ఆశ్చర్యపోయాడు ప్రవరసేనుడు.

“వైనా ఉజ్జయినీ మహామాత్యుల వంశం ఉద్భవించారేమో!” అన్నాడు మరొకమంత్రి.

పిమ్మట మంత్రులందరు మాతృగుప్త

చక్రవర్తిని పదభ్రష్టుణ్ణి చెయ్యడమెలాగా అని ఆలోచించడం ప్రారంభించారు. ప్రవరసేనుడు తమ ప్రథమ కర్తవ్యం అది కాదన్నాడు:

"మనం ముందుగా నిర్మూలించవలసింది విక్రమాదిత్య చక్రవర్తిని!"

"ముందుగా వంటఇంటి కుందేటి పని పట్టడమే సుకరం!" అన్నాడు తిరిగీ ఇంకొక మంత్రి.

"కాని మాతృగుప్తునికి విక్రమాదిత్యుడు దన్ను పడితే?—"

"ఆ విషయం అప్పుడే ఆలోచించుకోవచ్చును!" అన్నాడు మరి ఒక మంత్రి.

కాని ప్రవరసేనుడు దాని కంగీకరించలేదు. విక్రమాదిత్యుని నిర్మూలనానంతరమే మాతృగుప్తునిపై విప్లవం లేవదీయడం సుకరమనీ అదే సరియైన మార్గమనీ నిశ్చయించాడు. మంత్రుల కా నిశ్చయమే సరియైనదని అంగీకరించక తప్పలేదు వెంటనే మంత్రుల తోడ్పాటుతో విక్రమాదిత్యునిపై దండెత్తి పోవడానికి తగిన సైన్యాలు రహస్యంగా సిద్ధపరచడానికి తగిన ఏర్పాటులన్నీ జరిగిపోయాయి. ఈ ఏర్పాటులన్నీ మొట్టమొదట మాతృగుప్తుని గూఢచారులకుగూడా తెలియనంతటి నిగూఢంగా జరిగిపోయాయి.

## ౬

మాతృగుప్తునికి భార్యా వియోగం వల్ల జీవితం ఎంత దుర్భరమైనా కాశ్మీరరాజ్య కార్యనిర్వహణలో అతడొక క్షణమైనా ఏమరలేదు. అవిఘంగా నిరంతరం రాజ్యకార్యాలలో మునుగుతూ తేలుతూండడంవల్లనే అతనికి బాగా మనశ్శాంతి లభించింది. కాని ఏమాత్రం తీరిక దొరికినా ఆ వేళలో అతనికి సర్వమంగళ స్ఫురణకువచ్చేది. వెంటనే అతనికి సార్వభౌమాధికారము, భోగభాగ్యాలు మొదలైన వన్నీ కేవలం నిస్సారంగా స్ఫురించేవి.

అలాగ కొంతకాలం గడిచింది. ఒకనాడు మాతృగుప్తుడు తన ప్రాసాదంమీద నించి పరిసరోద్యానవనం సౌందర్యం తిలకిస్తున్నాడు. అప్పుడే సూర్యాస్తమయం అయింది. ఆకాశంలో సన్నని చంద్రవంక మెరిసింది. దూరదూరంగా గోచరించే మహా సరోవరంలో అక్కడక్కడ కొన్ని హంస మిథునాలు కదిలాడుతున్నాయి. ఆ నిర్మల సరోవరంలో వాటితోబాటు వాటి ప్రతిబింబాలుకూడా ప్రశాంతంగా సాగిపోతున్నాయి. అప్పుడే ఉదయిస్తున్న తారకలా గభీరజలాల్లో వెండిమీనులవలె తళతళ మెరిసిపోతున్నాయి. అంతలో విశాల సరోవరం అవతలి వైపు నుండి ఒక చిన్ననౌక హంసలా నెమ్మదిగా తేలివచ్చింది. దానిలో యువతీయువకు లిద్దరు విహరిస్తున్నారు. ఆ యువతి చేతిలో ఒక పసికందు!, నౌక అలికిడికి బెదిరిపోయిన రంగు రంగుల మీనులు పైకెగురుతూ తిరిగి నీటిలో మునిగాయి. వెంటనే ఆ సరోవరంలో చిన్ని చిన్ని వర్తులరేఖ లేర్పడ్డాయి అవి నీటిలో ప్రతిఫలించిన చంద్రవంక కాంతులలో ముత్యాలహారాలలా తళతళా మెరిసిపోయాయి! మాతృగుప్త చక్రవర్తి నేత్రాలా సౌందర్య డోలికలలో ఉయ్యాల లూగాయి.

తరవాత అలాగ రెండుమూడు నిమిషాలు గడిచిపోయాయి మాతృగుప్తుని సింహాసనానికి వెనకగా మనోజ్ఞమైన అందెలరవళి వినిపించింది! అతడాశ్చర్యపడి వెనక్కి తిరిగి చూచాడు. ఎదురుగా ఏడువారాల నగలు ధరించిన సర్వమంగళ! ఆమె చేతిలో అయిదేళ్ళ కుమారుడు! ఆమె ఆ పసివాణ్ణి మాతృగుప్తుని కందించింది. అతడెంతో అప్యాయంగా ఆ పసివాణ్ని ఎత్తుకున్నాడు. అంతలో అతనికేదో అనుమానం తోచింది. "నీకు బాగా నెమ్మదిగా ఉన్నదా? ఇంత దూరం ఒంటరిగా ఎలాగ ప్రయాణం చేయగలిగావు సర్వమంగళా?" అన్నాడు. ఆమె ఆమాట కేమీ సమాధానం చెప్పలేదు. అలాగే చిరునవ్వు నవ్వుతూ తిరిగీ ఆ పసివాణ్ని తీసుకొని అక్కడే అదృశ్యమైపోయింది! ఆ క్షణంలోనే మాతృగుప్తునికి యథార్థం కాదనీ స్వప్నమే అనీ స్ఫురించింది. ఆపైన ఏమి జరిగిందో అతనికి స్పృహ లేదు.

లేచి నాలుగు వైపులా పరిశీలించేసరికి చుట్టూరా పరిచారకులు కనిపించారు. వారనేకవిధాలుగా పరిచర్యలు చేసినమీదట అతికష్టంమీద అతనికి తిరిగీ స్మృతి కలిగింది.

చక్రవర్తికి ఎదురుగా మహామాత్యుడు కనిపించాడు. వెంటనే—"విక్రమాదిత్య చక్రవర్తి దేహస్థితి ఎలాగ ఉన్నది?" అని ప్రశ్నించాడు.

మహామాత్యు డా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. కొంచెం సేపూరకొని చేతులు జోడించి "మహాప్రభూ! నా దొక్క చిన్న మనవి. సావధానంగా చిత్తగించాలి." అన్నాడు.

"నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పవేల?" అన్నాడు మాతృగుప్తుడు కొంచెం అధికారస్వరంతో.

"మహాప్రభూ! విక్రమాదిత్య చక్రవర్తికి బాగా అస్వస్థతగా ఉన్నదని మనకు తెలిసి పక్షం రోజులే అయింది. అప్పటినుంచీ యామయామానికీ వేగరులు ఉజ్జయినికి పరుగులు పెడుతూనే ఉన్నారు. ఈ గడియకు చేరుకోవలసిన వేగరు లింకా తిరిగి రాలేదు. మరి తమకు నే నేమని మనవి చెయ్యగలను!" అన్నాడు.

తరవాత అమాత్యుడు ఒక నిమిషం వరకు ఏమీ మాట్లాడలేదు. తిరిగి చక్రవర్తి ముఖ భంగిమ పరిశీలిస్తూ—

"నాదొక్క మనవి!" అన్నాడు. చక్రవర్తి ప్రశ్నార్థకంగా బొమముడి విరిచాడు.

అమాత్యుడు కొంచెం సంకోచిస్తూ "తమరు తిరిగి వివాహం చేసుకొని తమవంశం నిలబెటవలెనని నా ప్రార్థన." అన్నాడు.

మాతృగుప్తుడు కొంతసేపటివరకు మాటలాడ కూరుకుని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు.

"ఈ విషయం మీ రొకటి రెండుమారులు నాకు విన్నవించి ఉన్నారు ... కాని నేనొక దురదృష్టవంతుణ్ని! ఈ దురదృష్టం ఇంకొకరికికూడా సంక్రమింప జెయ్యనేల!" అన్నాడు.

వెంటనే మాతృగుప్త చక్రవర్తి ముఖం ఉద్యానవనంవైపు తిప్పివేశాడు. అమాత్యుని కతని కనుగొలకులలో రెండు చిన్న కన్నీటి బిందువులు స్ఫురించాయి. చక్రవర్తి రాజ్యాధికారం స్వీకరించి అప్పుడే కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. కాని మంత్రికి చక్రవర్తి ముఖంలో ప్రప్రథమంగా నేడే బాష్పబిందువులు స్ఫురించాయి! ఆపైన అతడావిషయం మరి ప్రస్తావించడానికి సాహసించలేదు!

అలాగ ఒక నిమిషం గడిచిపోయింది. ఇంతలో ప్రతీహారి ప్రవేశించి—"ఉజ్జయినీ నగరంనుంచి వచ్చిన వేగరులు తమ దర్శనం కోరుతున్నారు."అన్నాడు అమాత్యునితో. అతడది వింటూనే వేగరుల వార్తలు తెలుసుకోవడానికి తొందరతొందరగా అక్కడినుంచివెళ్ళిపోయాడు.

మాతృగుప్త చక్రవర్తి కతడు తిరిగి వచ్చేవరకు క్షణమొక యుగంలా గడిచింది. అంతలో మంత్రి తిరిగివచ్చాడు. మంత్రి మొదట చిరునవ్వు నవ్వాడు. తరవాత ప్రసంగంలో కొంత పూర్వరంగం కల్పించి క్రమక్రమంగా నెమ్మది నెమ్మదిగా మాతృగుప్తునికి హర్ష విక్రమాదిత్యుని హఠాన్మరణ వార్త తెలియజేశాడు. మాతృగుప్తు డామాట విని నిలుచున్న పాటుగానే శిలాప్రతిమలా స్తంభించిపోయాడు.

## ౭

విక్రమాదిత్యుని మృతితో తలవని తలంపుగా తన ప్రతిజ్ఞ నెరవేరిపోయిందని ప్రవరసేనుడు చాలా సంతోషించాడు. తన సైన్యం అంతా ఇక శ్రీనగరంలో విప్లవం లేవదీయడానికి వినియోగించవచ్చుననీ తద్ద్వారా మాతృగుప్తుని తేలికగా తొలగించవచ్చుననీ ఆశించాడు. కాని ఇటీవల మాతృగుప్తుడు కూడా సైన్యం సమాయత్తపరిచా



# కవి చక్రవర్తి



డనీ శత్రువిచ్ఛేదానికి సకల ప్రయత్నాలు చేస్తున్నాడనీ తెలిసింది. ప్రవర సేనుడు లోలోపల మాతృగుప్తుని జాగరూకతకెంతో మెచ్చుకొన్నాడు. కాని తన ప్రయత్నాలకొక పెద్ద విఘాతం ఏర్పడినదే అని ఎంతైనా మథనపడ్డాడు.

ఆ తరవాత కొన్ని దినాలకు మాతృగుప్త చక్రవర్తి హఠాత్తుగా రాజ్యపరిత్యాగం చేశాడనీ తాత్కాలికంగా కాశ్మీర రాజ్య పరిపాలన వ్యవహారం అంతా మహామాత్యునికే అప్పజెప్పాడనీ తెలిసింది. మొట్ట మొదట ప్రవరసేనుడది విశ్వసించలేదు. పిమ్మట వేగులవారిద్వారా ఆ వార్త నిశ్చయమేనని స్పష్టపడిపోయింది. మాతృగుప్తుడావిధంగా కాశ్మీరరాజ్యసంరక్షణకై బలాలన్నీ సమాయత్తపరిచినా, హఠాత్తుగా రాజ్య పరిత్యాగం చెయ్యడానికిగల కారణమేమో ప్రవరసేనునికి బోధపడలేదు. ఇక కాశ్మీర రాజ్యం కూడా తేలికగా తన హస్తగతమైపోగలదనీ, తన ప్రతిజ్ఞ నెరవేరిపోయిందనీ ఎంతైనా సంతోషించాడు. కాని మాతృగుప్త చక్రవర్తి హఠాత్తుగా రాజ్య పరిత్యాగం చెయ్యడానికి కారణం? అది తెలుసుకోవడం తన ప్రయత్నాల కత్యంతావశ్యకమని ప్రవరసేనుడు నిశ్చయించాడు. వెంటనే మాతృగుప్తుని సందర్శించవలెనని అనుకొన్నాడు. కాని రాజ్య వ్యవహారాలనుగురించి ప్రసంగించదలుచుకొన్నవారికెవరికీ మాతృగుప్త చక్రవర్తి దర్శనం లభించడంలేదు! రాజ్య పరిత్యాగం చేసినప్పటినించీ మాతృగుప్తుడు కేవలం కవి పండిత గోష్ఠితోనే కాలక్షేపం చేస్తున్నాడు. రాజ్య వ్యవహారాలు సంప్రదించదలుచుకొన్నవారి నందరినీ వెంటనే మహామాత్యుని సన్నిధికి పంపించి వేస్తున్నాడు. అందువలన పండితవేషంతోనే మాతృగుప్తుని సందర్శించవలెనని ప్రవరసేనుడు నిశ్చయించాడు.

అటుపిమ్మట విద్వాంసునివేషం వేసుకొని మాతృగుప్తుని సందర్శనంకోసం బయలుదేరాడు.

అప్పటికి చైత్రం కొంతవరకు గడిచింది. మాతృగుప్తుడు రాజభవనం పరిసరోద్యానవన సౌందర్యం తిలకిస్తున్నాడు. రాజప్రాసాదానికి నాలుగువైపులా అల్లిబిల్లిగా అల్లుకొన్న ద్రాక్షపందిరులపై ప్రాతఃకాల సూర్యకిరణాలప్పుడప్పుడే ప్రసరిస్తున్నాయి. ఆ కాంతులలో ద్రాక్షాఫల గుళుచ్ఛాలు సువర్ణచ్ఛాయలతో మెరుస్తున్నాయి. రంగురంగుల చిలకలా ఉద్యానవనంలో బారులుదీర్చి విహరిస్తూ చిత్రవిచిత్రమైన వసంతోత్సవతోరణాల్లాగ కదలాడుతున్నాయి.

ప్రవరసేనుడు ద్వారంలో నిలబడి మాతృగుప్తుని ముఖవైఖరి పరిశీలించాడు. అతని విశాలనేత్రాలు ప్రాతఃకాల సౌందర్య శోభలో మునకలు వేస్తున్నట్టున్నాయి. ఒక్క నిమిషం అలాగే నిలబడి ప్రవరసేనుడు మాతృగుప్తునికి నమస్కరించి ఎదురుగా ఒక సుఖాసనంలో కూర్చున్నాడు. కొంతప్రసంగము గడిచినతరవాత మాతృగుప్తునికి తన నిజ నామధేయము, తన జిజ్ఞాస తెలియచేశాడు. మాతృగుప్తుడు దానికాశ్చర్యపడలేదు. ప్రవరసేనుని రాకవిషయం అతడంతకుపూర్వమే అవగాహన చేసుకున్నాడు. కొంతవరకు మౌనభావం వహించి నెమ్మదిగా ఇలాగన్నాడు.

"మీ రెప్పుడైనా సూర్యకాంత మాణిక్యం పరిశీలనగా చూశారా?"

"చూడకేమి? అయినా ఎందుకలాగ ప్రశ్నిస్తున్నారు?"

"ఆదిత్యుని అస్తమయంతో సూర్యకాంత మణి దీప్తి తగ్గిపోతుంది. విక్రమాదిత్య చక్రవర్తి అస్తమించినపిమ్మట మరి నా దీప్తి అంతే!"

అంతటి ప్రభుభక్తివిశ్వాసాలతో అన్న ఆవాక్యం మొట్టమొదట ప్రవరసేనునికెంతో ఆశ్చర్యంకలిగించింది. అయినా అతడంతగా అది విశ్వసించలేదు. మెల్లిగా ఇలా గడిగాడు.

"మా సైన్యసన్నాహం చూచి తమరీ విధంగా రాజ్యత్యాగం చేశారేమో అని లోకం భావిస్తున్నది. నిజమేనా?"

"లోకప్రవాదానికి నేనాశ్చర్యపడడం లేదు. ఆ ప్రవాదం మీవంటివారు విశ్వసించినందుకే నేనాశ్చర్యపడుతున్నాను. అయినా మించిపోయినదేమీ లేదు! రణరంగంలో ఒకసారి బలాబలాలు పరీక్షించుకొందాము. సరేనా?"

అని మాతృగుప్తుడతనివైపు చూచాడు.

ప్రవరసేనునికి తన తప్పిదం తెలిసిపోయింది. మాతృగుప్తుని ఔదార్యంతో పాటు నేడతని ధైర్యసాహసాలు కూడా చవి చూచాడు.

ఒక నిమిషంవరకు అత్యాశ్చర్యదృష్టితో అతని ముఖం పరిశీలించాడు. మాతృగుప్తుడు ఒక్క చిన్న నవ్వు నవ్వి ఇలాగన్నాడు:

"విక్రమాదిత్య చక్రవర్తి కేవలం కవితా గౌరవంతో నాకీ సామ్రాజ్యప్రదానం చేశారని మీరు భ్రమిస్తున్నారు! ఒక్క సంవత్సరంపాటు అహోరాత్రాలు నా వతుత పరీక్షచేసినమీదటే నాకీ సామ్రాజ్య ప్రదానం జరిగినది."

ప్రవరసేనుని కా విషయం మరింత ఆశ్చర్యం కలిగించింది. అతని హృదయంలో మాతృగుప్తునిమీద, అతనిఅర్హతమీద కలిగిన అపోహాలన్నీ ఒక్కసారిగా పటాపంచలైపోయాయి. క్రమ క్రమంగా ఇంతటి మహాత్ముడే ఇంకా కాశ్మీరం పరిపాలించడమే సముచితమనే గౌరవభావం కూడా కలిగింది.

"తెలియక నేనేమో ప్రసంగించాను! నన్ను మన్నించండి!" అన్నాడు. దాని మీద మాతృగుప్తుడు — "రాజ్యత్యాగం చేసినా నా ఔద్ధత్యం ఇంకా నన్ను విడిచిపెట్టలేదు! ఇందువల్ల మొట్టమెదటగా మీరు మన్నించవలసినది నా ఔద్ధత్యమే!" అన్నాడు.

ఆ వినయప్రసంగంతో ప్రవరసేనుని కంఠం స్తంభించిపోయింది. ఒక దేవతామూర్తిని చూచినట్లు మాతృగుప్తునికేసి చూచి సవినయంగా ఇలాగన్నాడు.

"విక్రమాదిత్యులు మీకే రాజ్యప్రదానం చేసిన హేతువేమో ఇప్పుడిప్పుడే నా కవగతమయింది. వారు చేసినట్టుగానే నేను కూడా ఈ కాశ్మీర రాజ్యం తిరిగి మీ కర్పిస్తున్నాను. దయఉంచి నా ప్రార్థన మన్నించవలసినదని కోరుతున్నాను!" అన్నాడు.

"మీరు కొంచెం పొరబడుతున్నారు. ఒక చక్రవర్తి ఇతరులదగ్గర దానం స్వీకరించగలడా? ఇది తెలిసిఉండినీన్ని మీ రిలాగ ప్రార్థించడం భావ్యమేనా?" అని ఒక చిరునవ్వు నవ్వాడు మాతృగుప్తుడు. అటు పిమ్మట ప్రవరసేనునికి మాతృగుప్తునియెడల పూజ్య భావం ఇనుమడించింది. ఎలాగైనా తన ప్రార్థన మన్నించవలసినదని అనేక విధాలుగా ప్రాధేయపడ్డాడు. దానికి మాతృగుప్తుడొక్క నిట్టూర్పు విడిచి నెమ్మదిగా ఇలాగన్నాడు:

"ప్రవరసేనా! నా జీవిత సహధర్మచారిణి సర్వమంగళ, ఏకైక వంశాంకురము దివంగతులైనారు. కవితాప్రియులైన విక్రమాదిత్యచక్రవర్తులు స్వర్గానికి విజయంచేశారు. బాల్యంనించీ కవిచక్రవర్తిని కావలెనని ఆకాశహర్మ్యాలు నిర్మించుకొన్నాను! అవ్వన్నీ నేలపాలైపోయాయి. మరి నేను దేనిని చూచుకొని ఈ సామ్రాజ్యభారం వహించను!"

"మీరు కాశ్మీరప్రజ విషయమే విస్మరిస్తున్నారు!"

"లేదు! ఇకనించి సర్వసమర్థులైన మీరే ప్రజాపరిపాలకులు!" అన్నాడు మాతృగుప్తుడు.

"అది ఎన్నటికీ జరగనేరదు. తాము

# చివరకు తేలింది

హనుమాన్లు కార్నర్‌లో మలుపు తిరగానే హఠాత్తుగా కనిపించిన గోపాలాన్ని చూచి అన్నాడు ముఖం వేళ్లాడేసుకుని:

"నేనిక బ్రతుకనోయ్" అని.

గోపాలం బిత్తరపోయాడు. ఉలిక్కిపడ్డాడుకూడా. కంగారుగా సైకిల్ దిగాడు.

"ఏం? ఇదేంఅఘాయిత్యం? మీ నాన్నతో గాని మళ్లా పోట్లాడావా ఏం ఖర్మ?"

హానుమాన్లు క్షణం సేపటివరకు మౌనంగా వుండి, ముఖంమీద, గంభీరమైన విషాదరేఖ సృష్టించి, ఒక పెద్ద నిట్టూర్పువిడిచి మళ్లీ ఆ ముక్కే అన్నాడు కొంచం హెచ్చు స్థాయిలో......

"నే నిక బ్రతుకనోయ్...!!"

గోపాలం గాబరాపడ్డాడు. 'విషయమేమిటో చెప్పడేం? తిక్కరకం!' అని మనస్సులో విసుక్కున్నాడు.

అప్పటి హానుమాన్లు పరిస్థితి చూస్తే చాలా జాలివేసింది గోపాలానికి. ముఖం అంతా వల్లబడి పెంకులా వుంది. తలమీదవి నాలుగు వెంట్రుకలైనా, శృతికి రాసిన నూనె కాస్తా హరించుకుపోయి పీచులా రేగివున్నాయి. ఇంచుమించు ఎప్పుడు చూచినా, మడత నలగని యిస్త్రీబట్టలతో కనిపించే హానుమాన్లు ఆనాడు నల్లగా మాసినబట్టలు వేసుకున్నాడు...

గోపాలం, హానుమాన్లుకి కొస్త ధైర్యం చెప్పినమీదట చిఱునవ్వుతో అన్నాడు.

"మళ్ళీ ఏమయినా యుద్ధం ప్రకటించావా మీ యింట్లో...?"

"లేద"ని అడ్డంగా తలవూపాడు హానుమాన్లు.

ఇంట్లో, అడపా దడపా దెబ్బలాడి, ఆ రాత్రల్లా ఏ హోటల్లోనో గది అద్దెకు తీసుకుని మకాంవేసి, తెల్లవారి ప్రొద్దున్నకల్లా మళ్లా యథావిధిగా యింటికి హాజరవటం పరిపాటే హానుమాన్లుకి. అయితే

**సత్యశ్రీ**

ఈ రోజు, అటువంటిదేమీ కాకుండా, ఇటువంటిమాట అన్నాడంటే ఏదో గొప్ప విశేషమే వుందనుకున్నాడు గోపాలం.

"మరో రెండు, మూడు నెలల్లో పెళ్లి కొడుకువి కాబోతున్నావు—యింతలో నే ఏమొచ్చి పడ్డదిరా నాన్నా...?" అన్నాడు గోపాలం, దిగులు దిగులుగా నేలచూపులు చూస్తూ, గోడుమీద కాలితో రాస్తూన్న హానుమాన్లు భుజం తడుతూ.

మరో మాంచి 'మూడ్'లో వుండివుంటే ఆ మాటకు హానుమాన్లు పక్కుమని నవ్వేవాడే...అయితే యిప్పుడు కనీసం మందహాసంకూడా రాలేదు ఆ మనోజ్ఞమైన వదనం మీదకు...! అయితే ఒక్క క్షణంమాత్రం మౌనంగా ఉండి అకస్మాత్తుగా ఏదో గుర్తుకొచ్చినట్టు తక్కుమని అందుకున్నాడు హానుమాన్లు.

"ఇదిగో సముద్ర పొడ్డుకు పద-చెప్తా."

గోపాలం వాడి కళ్ళల్లోకి చూచి నవ్వాడు.

"దేనికి? చావటానికా? నేను కూడా దేనికి? నాకు చావాలని లేదు!" అన్నాడు వ్యంగ్యధోరణిలో నవ్వుతూ.

హానుమాన్లు వదనంలో దరహాసరేఖలు ఒక్కసారిగా మెరిశాయి.

"ఛా, ఉత్తినే అన్నా, అక్కడ ఏకాంతంగా కూర్చొని అంతా చెబుతాను-పదు!"

'సరే' అన్నాడు గోపాలం. ఇద్దరూ కలసి, ముందుగా గోపాలంయింటికి వెళ్లి, సైకిల్ మీద తెచ్చిన కూరగాయలసంచి యింట్లో యిచ్చివేసి, మధ్యదారిలో హోటల్లో బిల్లు చెల్లించుకుని సముద్ర పొడ్డుకు బయలుదేరారు.

సముద్రపుటొడ్డు రకరకాల వ్యక్తులతో రంగు రంగులుగా విలసిల్లుతోంది. సముద్ర గర్భంలోకి, సాయంకాలపు సూర్యుడు చొచ్చుకునిపోతూ, ఉవ్వెత్తుగా లేచే సముద్రతరంగాలమీద బంగారుపూత పూస్తున్నాడు. సముద్రం హోరు పెడుతూ చల్లటిగాలిని వెదజల్లుతోంది.

ఈవ్యక్తు లెవరితోటీ సంబంధం లేకుండా ఆ యిద్దరు మిత్రులు చివరకంటా పోయి, ఒడ్డునే వున్న కొబ్బరిచెట్ల నీడల్లో కూర్చున్నారు. సమీపంలోనే, యిసుకపర్రలో నుంచి సముద్రగర్భంలోకి చొచ్చుకుపోయిన నల్లరాళ్ళ గుట్టకి, తరంగాలు బలంగా, ఢీకొన్నప్పుడల్లా నీటితుంపరలు పైకి ఎగిరి ముత్యాలు రాలినట్లు రాలుతూన్నాయి.

గోపాలం కొబ్బరిచెట్టుకు జేరబడి కూర్చున్నాడు. హానుమాన్లు, ఎదురుగా మౌనంగా కూర్చుని వున్నాడు.

"సరి-యిక చెప్పు నీ పురాణం ఏమిటో;" అన్నాడు గోపాలం.

హానుమాన్లు మౌనంగానే లేచి నిలబడి, పాంటు జేబులోనుంచి ఏవో కాగితాలుతీసి గోపాలం ముందు పడేస్తూ అన్నాడు:

"చూడు గోపాలం!" నువ్వు నా ప్రాణమిత్రుడివే అయినా, యిన్నాళ్లుగా నాకు ఈ విషయం చెప్పకుండా దాచినందుకు క్షమించు-అలా అని నే నెందు కనుకున్నా

---

జీవించి ఉన్నంతకాలము తిరుగి కాశ్మీరాధీశ్వరులు! మేమంతా మీ భృత్యులమే!"

అని చెప్పి ప్రవరసేనుడు నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయాడు.

చక్రవర్తి ప్రవరసేనునిలో హఠాత్తుగా కలిగిన అద్భుత పరిణామాని కెంతో ఆశ్చర్య పడ్డాడు.

అటుపిమ్మట నాలుగైదు రోజులకు మాతృగుప్తుడు సన్న్యసించాడనీ వెంటనే వారాణసీ నగరానికి వెళ్లిపోయాడనీ ప్రవరసేనుని కొకవార్త తెలిసింది. అనంతరం మాతృగుప్తుని ఆజ్ఞాప్రకారంగా కాశ్మీర మహామాత్యుడు ప్రవరసేనుని రాజ్యాధికారం స్వీకరించవలసినదని ప్రార్థించాడు. ఆ పరిసితులలో ప్రవరసేనునికి రాజ్యాధికారం స్వీకరించక తప్పలేదు.

మాతృగుప్తు డటుపిమ్మట పది సంవత్సరాలు జీవించాడు. అంతవరకు ప్రవరసేనుడు మాతృగుప్తుని ప్రతినిధిగానే కాశ్మీర రాజ్యం పరిపాలించాడు. కాశ్మీర రాజ్యాదాయం అంతా మాతృగుప్తునికే పంపించేవాడు. మాతృగుప్తుడూ ఆదాయంఅంతా తిరిగి కాశ్మీరానికే పంపించి దానిలో స్వల్పాదాయం మాత్రమే స్వీకరించి అది విద్వాంసులకు, కవీశ్వరులకు, యతీశ్వరులకు, యాచకులకు, దీనులకు దానం చేసేవాడట!

పామరులు విశ్వసింపలేరనే భయంతో విశ్వసనీయమైన యథార్థ విషయాలే వ్రాస్తున్నానని కల్హణుడు రాజతరంగిణి పీఠికలో పేర్కొన్నాడు! ఆ కల్హణుడే విక్రమాదిత్య మాతృగుప్త ప్రవరసేనుల చరిత్రలు మూడు మూడు పునీతమార్గాల్లో ప్రవహించిన ఆకాశగంగానదీ ప్రవాహాలవంటివని ముక్తకంఠంతో ప్రశంసించాడు! ☆



# చివరకు తేలింది



నంటే, పర్యవసానం ఏమిటో తెలుసు కునేవరకూ చెప్పగూడదనుకున్నాను. ఇప్పుడు దాని పర్యవసానమే తేలింది! ఐతే ఐతే...!" యిక మాట్లాడలేక, మనస్సులో వున్న ఉక్రోషమో, ఉద్రేకమో బయటకు ఒక్కుమ్మడిగా తన్నుకురావడం వల్ల ఆగిపోయాడు హనుమాన్లు...!

గోపాలం, వాడి ఉపన్యాస ధోరణి ముగ్ధుడై విన్నమీదట, వాడిచ్చిన కాగితాల కట్ట విప్పటం మొదలు పెట్టాడు.

వాటిని ఒక్కటొక్కటిగా తీసిచూస్తూ తెల్లపోయాడు గోపాలం. అందులో అన్నీ ముత్యాల్లాటి దస్తూరితో హనుమాన్లు రాసిన ప్రేమలేఖలు! అయితే వాటిని పూర్తిగా చదివేభాగ్యం కలుగ లేదు గోపాలానికి. ఉత్తరాలనిండా, నల్లసిరా జిమ్మిన మరకలు వాటిమీద చిక్కిరి బిక్కిరిగా కొట్టివేసిన పిచ్చిగీతలు దట్టంగా అల్లుకొని ఉన్నాయి! వాటిలోనే ఒక చక్కటి బొమ్మ ఎంతో జాగ్రత్తగా చిత్రించిన అమోఘమైన చిత్రం కోతిబొమ్మ ఉంది! దానిక్రింద 'వాయుసుతుడు' అని చక్కని అక్షరాలు, ముద్దులొలికే అక్షరాలు చిత్రింపబడి ఉన్నాయి.

గోపాలానికి ఇవన్నీ చూచేసరికి మతి పోయినట్లయింది. కొన్ని క్షణాల వరకు మాట్లాడలేకపోయాడు. కొంతసేపటికి తేరుకుని హనుమాన్లుకేసి వింతగా చూచిఅన్నాడు:

"ఏమిటి! ఇదెప్పటనుంచి! అయితే వాటినిండా సిరామరకలు, కొట్టివేతలు, ఆబొమ్మ, దీని అర్థం ఏమిటంటావ్?"

హనుమాన్లు మాట్లాడలేదు. హృదయకుహరంలోవున్న ఉద్రేకం కళ్లల్లోంచి బయటకు వెళ్లగక్కుతున్నాడు. గోపాలం మళ్ళీ అందుకున్నాడు అతనినుంచి సమాధానం రాకముందే.

"దమయంతి! మీ ఇంటిప్రక్కయింట్లో ఉంటూన్న వకీలుగారి అమ్మాయి థర్డ్ బి.ఏ. నా మట్టుకు నాకు చాలా పెంకిపని అని పిస్తూంది!"

పెల్లుబికివస్తూన్న నవ్వును బలవంతంమీద ఆపుచేసుకుంటూ అన్నాడు గోపాలం: ఇదేమీ కనిపెట్టలేదు హనుమాన్లు.

"అదే, అదే." హనుమాన్లు గంభీరోపన్యాసం మొదలుపెట్టాడు: "ఆమె నాప్రేమ నిరాకరించిందని నేను విచారించడం లేదిప్పుడు. నిజంగా దమయంతిని నేను మనసారా ప్రేమించానసే అనుకో-నా ఉద్దేశ్యం ఆమెకు తెలియాలంటే ఉత్తరాలు రాయక తప్పదు. అందుకని రాశాను-చాలా చాలా రాశాను. బహుశః ఆమెకు నన్ను పెళ్ళిచేసుకోడం ఇష్టంలేకపోతే మొదటి ఉత్తరానికే ఆ ఉద్దేశ్యం చెప్పేస్తే ఎంత బావుండేది? నన్నిలా అవమానించడం దేనికి? మొదటే ఆమె ఉద్దేశ్యం తెలిస్తే మళ్ళీ ఆమె వైపు కన్నెత్తిగూడా చూచివుండేవాణ్ని కాను. ఆ ఉత్తరాల్లో అసభ్యతగాని, అవినీతిగాని స్ఫురించే వాక్యం ఒక్కటీ రాయలేదు నేను. అటువంటప్పుడు-యిలా అవమానించాల్సిన అవసరం? పైగా ఆ బొమ్మ! దాని అర్థం ఏమిటి? నిజంగా నేను తలచుకుంటే ఏ పనైనా చెయ్యటానికి వెనుకాడను!"

ఇంకా, ఏదో ఏదో మనస్సులో రగిలే ఉక్రోషాన్నంతా వెళ్ళగక్కేవాడు హనుమాన్లు.

గోపాలం యిదంతా విన్నమీదట వాణ్ని ఓదార్చాడు (?) పైకి. అయితే, దమయంతి మరేప్రమాదమైన రసాభాసం చెయ్యకుండా యింతటితో సరిపెట్టినందుకు లోలోన సంతోషించాడు గోపాలం. ఈ వుద్దేశ్యమే హనుమాన్లు దగ్గర పెడితే వాడు ఒప్పుకోడని తెలుసు గోపాలానికి. నిజంకూడా అంతే--

హనుమాన్లు, గోపాలం చేతిలోనుంచి ఆ ఉత్తరాలు, ఆ బొమ్మ అవి తీసుకున్నాడు ఎందుకో.

"అయితే వీటిని ఏమి చేద్దామనుకుంటూన్నావు?" అన్నాడు గోపాలం హనుమాన్లువైపు వింతగా, జాలిగా చూస్తూ.

హనుమాన్లు గంభీరంగా నవ్వాడు.

"అదే-చెప్తా నడు. ఆ నల్లరాళ్లగుట్ట వుంది చూడు సముద్రంలో, వాటిమీదకు పద-" అన్నాడు కాగితాన్ని చుట్టగా చుడుతూ. గోపాలం ముందు విస్తుపోయి, తరువాత నవ్వాడు- "కొంపతీసి వీడుకూడా వాటితోపాటు సముద్రంలో దూకడు కదా?" అనుకున్నాడు. హనుమాన్లు తరచూ ఎక్కువగా తెలిసివున్నవాడు కాబట్టి ఆ భయం ఏమీలేదనుకున్నాడు మళ్లీ.

ఇద్దరూ ఆ రాళ్లగుట్ట ఎక్కారు. హనుమాన్లు కొన్నిక్షణాలు ఆ ఉత్తరాల చుట్టకేసి తీక్షణంగా చూచి, విసురుగా సముద్రంలోకి విసరిపారవేసి తిరిగి, అప్రయత్నంగా 'కవ్వు'మన్నాడు.

ఆ రాళ్లగుట్ట ప్రక్కనుంచే, యిసుకలో నడిచివెళుతూ, సిల్కురుమాలతో నోరు మూసుకుని, వాళ్లను దాటగానే ఒక్కసారిగా కిలకిలా నవ్వేశారు యిద్దరు యువతులు...!

ఉడికిపోయాడు వాయుసుతుడు.

మండిపోతున్నాడు పవన నందనుడు.

పళ్లు పట పటలాడించాడు అనిల పుత్రుడు.

ఆ యిద్దరు యువతులు పోనుపోను దూరమైపోయారు. ఒకామె, రెండుజడలు వేసుకుంది—ఒకటి ముంగుకు, రెండోది వెనక్కు. చేతిలో, అందమైన తెల్ల సీమ కుక్కపిల్లను గొలుసుతో పట్టుకుంది. పాల నురుగులాంటి సిల్కు కోక- గులాబిరంగు జాకెట్.

"దమయంతి!" అన్నాడు గోపాలం.

హనుమాన్లు దారుణమైన కోపంలో వున్నాడేమో, ఏమీ మాట్లాడకుండా వాళ్లు పోయే దిక్కువైపుకే చూస్తూ నిలబడి పోయాడు-

గోపాలం, అతని రెక్క పట్టుకుని మెల్లగా రాళ్లమీదనుంచి యిసుకలోకి తీసుకొచ్చాడు.

"చాలా పెంకిఘటం? నువ్వు వాటిని సముద్రంలోకి విసరడం చూసిందేమో! ఆ ప్రక్కనున్న ఆమె ఎవరంటావ్? క్లాస్ మేట్ కదూ?

ఇక హనుమాన్లు మాట్లాడకుండా వుండ లేకపోయాడు-

"అవును- వాళ్లందరితో ఈ విషయం చెప్పి నా పరువు ప్రతిష్ఠలు తియ్యాలని చూస్తోందనుకుంటా. చూచి చూచి యింత పని చేస్తుందనుకోలేదు దమయంతి. అయితే నా తడాకా యింకా తెలియదు కాబోలు కానియ్" అంటూ తల పంకించాడు హనుమాన్లు.

వీళ్లిద్దరూ రోడ్డు ఎక్కేసరికి నడినెత్తిన చంద్రుడు ప్రకాశిస్తూన్నాడు. మొదట కలుసుకున్న 'కార్నర్'లోనే యిద్దరూ విడిపోయారు. హనుమాన్లు హృదయం ఉడికిపోతోంది. గోపాలం హనుమాన్లుమీద సానుభూతి ప్రకటించాడు

* * * *

తెల్లవారింది. ఉదయం 9-30 దాటింది.

కాలేజీ ఆవరణలో ఏదో కలకలం బయలుదేరింది. విద్యార్థులు - వికవికలు, గుసగుసలు మొదలుపెట్టారు. ప్రిన్సిపాల్ ఆఫీసు గది వరండాలో, చేతులు వెనక్కు పెట్టుకుని, రుసరుసలాడుతూ అటుయిటూ తిరుగుతూన్నాడు- నేరస్థు డెవరాఅని ఆలోచిస్తూ.

ఇంత రసాభాసానికి కారణం ప్రహరీ గోడలనిండా మసిబొగ్గుతో దమయంతిమీద అసభ్యమైన రాతలు రాశారు ఎవరో! ఆ సమస్యే తేలడంలేదు.

రెండుబకెట్ల నీళ్లతో ఆ రాతలన్నీ కనిపించకుండా చెరిపించేసి, ఆలోచనలో పడ్డాడు ప్రిన్సిపాల్—

క్లాసులు జరుగుతున్నాయి. సందడంతా తగ్గిపోయింది.

హనుమాన్లు క్లాసులో కూర్చున్నాడేగాని

తెల్సిన వేమీ చెప్పలేకపోతు న్నాడో అర్థం గావటంలేదు. అవునుమరి- ఎలా అర్థమవుతుందీ....? ఓ ప్రక్క భయం వేధిస్తోంటే-

హనుమాన్లు ఆ ఉక్రోషంలో తొందరపడి, యిక ఆ వేశం పట్టలేక, ఒకరాత్రి వచ్చేసి ఈ పని చేశాడే గాని, యిప్పుడు దాని పర్యవసానం తలచుకుంటోంటే వణుకొస్తోంది.

దమయంతి తప్పకుండా, తనమీదే, తన అనుమానాన్ని వ్యక్తం చెయ్యకుండా మానదు-ప్రిన్సిపాల్‌తో...అప్పుడు జరిగే దేమిటి? బహుశః ప్రిన్సిపాల్ పెద్ద చర్యనే తీసుకుంటాడు. ఈ విషయంలో అవును-తప్పదు. ఛీ! తను తొందరపడిపోయాడు ఈ విషయంలో. తనకు హానిరాని విధంగా పగతీర్చుకోవలసింది దమయంతి మీద. అయితే యిప్పుడు ఏంలాభం జరిగిపోయిన తరువాత-తన యింట్లో ఈ విషయం తెలిస్తే? కొంపలంటుకోవూ-తన్ను మళ్ళీ గడప త్రొక్కనివ్వడు తన తండ్రి.

ఇంకా ఏదో ఏదో ఆలోచించాడు హనుమాన్లు. ప్రక్క బెంచీల్లో కూర్చున్న గోపాలంకేసి చాలాసార్లు చూచాడు అతి జాలిగా. ఆచూపులో తను తొందరపడ్డట్టు వ్యక్తమవుతున్నది. గోపాలం మొదటే ఊహించాడు గోడమీద రాసిన రాతలు చూచి. అయితే నిజంగా యింత సాహసం, తొందరపాటు చేస్తాడనుకోలేదు హనుమాను.

క్లాసు మరో అయిదునిమిషాలకు అయిపోతుం దనగా, ప్రిన్సిపాల్‌దగ్గరనుంచి ఏదో నోటీసు వచ్చింది. నోటీసు అనగానే హనుమాన్లు గతుక్కుమన్నాడు. గుండెలు వేగంగా కొట్టుకుంటూన్నై. బహుశః తనను హాజరు కమ్మని అయివుంటుంది అనుకున్నాడు.

అయితే నోటీసు చదవగానే క్లాసులో అందరికన్నా ఎక్కువ, హనుమాన్లు ఆశ్చర్యపోయాడు, గోపాలం ఉలిక్కిపడ్డాడు.

ఆ నోటీసులో ఈ క్లాసుముగియగానే, గోపాలం తక్షణం ప్రిన్సిపాల్‌ముందు హాజరు కావాలి అని వుంది.

గోపాలానికి అర్థం కాలేదు తన్ను ఎందుకు హాజరు కమ్మన్నది కూడా. హనుమాన్లుకి అంతకన్నా అర్థంకాలేదు. అయితే తక్కిన క్లాసు విద్యార్థులకు మాత్రం ప్రొద్దుటి కేసు విషయంలో గోపాలం ప్రసక్తి వుండి వుంటుంది అని అనుకున్నారు కొందరు.

గోపాలం, ప్రిన్సిపాల్ ఎదుట హాజరయ్యే ముందు హనుమాన్లు, ఎంతో జాలిగా ప్రాధేయపడ్డాడు. ఒకవేళ తన విషయంలో యింకా ఎక్కువ బలమైన సాక్ష్యాలు గోపాలంద్వారా, ఆ తాతియ్యాల్సిన పుద్దేశ్యం వుంటే, ఏమాత్రం తొణకొద్దని బ్రతిమిలాడుకున్నాడు గోపాలాన్ని. గోపాలానికి ఒక ప్రక్క హనుమాన్లు మీద జాలి, మరో ప్రక్క అయోమయమైన పరిస్థితి ఏర్పడింది.

గోపాలం ప్రిన్సిపాల్ గదిలోకి ప్రవేశించగానే, చురచుర చూచాడు ప్రిన్సిపాల్ అతనివంక-ప్రక్కనే మరో బెంచీ మీద దమయంతి కూర్చుని వుంది తలవంచుకుని. గోపాలం రాగానే తలవంచుకునే కొటుకకళ్ళతో గమ్మత్తుగా చూసింది గోపాలంవైపు.

గోపాలం వినయంగా ప్రిన్సిపాల్‌కి నమస్కరించి నిలబడ్డాడు-

ప్రిన్సిపాల్ గంభీరంగా మొదలుపెట్టాడు.

"చూడు గోపాలం యింతకు మునుపు నిన్ను చాలా మంచివాడు, అమాయకుడు అనుకున్నాను. కాని యింత ఘటికుడవు అనుకోలేదు. ప్రొద్దుటవిషయంలో, ఆ రాతలు రాసింది, నువ్వే అయివుంటావని దమయంతి స్వయంగా రిపోర్టు చేసింది. దీనికి సంజాయిషీ ఏమి చెప్పుకుంటావ్?" అన్నాడు.

ఇది వినగానే గోపాలం అదిరి పడ్డాడు. కొన్ని క్షణాలవరకూ మాట రాలేదు. ఇది చాలా అగమ్యగోచరంగా కనిపించింది గోపాలానికి.

తను అనుకున్నదివేరు-యిప్పుడు జరిగేది వేరయింది. దమయంతి యిలా తనమీద ఎందుకు నిందవేసి వుంటుంది? బహుశః నిజం తెలియకా? అది నమ్మదగినదికాదు—హనుమాన్లే రాశాడని ముమ్మాటికీ తెలుసు దమయంతికి. మరయితే యిలా ఎందుకు చేసింది? లేకపోతే, నిజంగా తనే రాశా ననుకుంటుందేమో?

అమాయకంగా దమయంతి కళ్ళల్లోకి చూచాడు గోపాలం. దమయంతి గమ్మత్తుగా నవ్వింది...! ఆ నవ్వులో అర్థం ఏమిటో తెలియలేదు గోపాలానికి.

ప్రిన్సిపాల్ గోడవైపు తిరిగివున్న వాళ్ళల్లా యిటు తిరిగి కోపంగా అంటు న్నాడు:

"ఊఁ...! చెప్పు—స్వయంగా ఆడపిల్ల వచ్చి, రిపోర్టు చేసిందంటే యిక దానికి ఆలోచించాల్సిన పనిలేదు. నువ్వు 'కాద'ని వాదించినా నేను నమ్మేదిలేదు. తొందరగా ఒప్పుకో. కొద్దిలోనే పోతుంది. లేదంటావా పెద్ద చర్య తీసుకోవాల్సి వస్తుంది."

గోపాలం ఆలోచనలో పడ్డాడు. నిజం తేలేవరకూ ప్రిన్సిపాల్ వూరుకోడు-అసలు దమయంతికి నిజం తెలిసి కూడా తన్ను యిలా ఏడిపిస్తోందా? అలా అనుకుంటానికి ఆమెకు తనేమి అపకారం చెయ్యలేదే.! పోని నిజం తనే చెప్పేస్తే? అసలు విషయం అంతా ఏకరవుపెట్టి! లాభంలేదు. ముప్పు వచ్చేదల్లా హనుమాన్లుకి. వాడిప్పటికే ఏడుస్తూన్నాడు. ఈ విషయం, వాడింట్లో తెలిస్తే అసలు గుమ్మం త్రొక్కనివ్వడు వాడి నాన్న. బహుశః ఫైను వేస్తే యిచ్చుకోలేడు కూడా. మరేమిటి దారి? ప్రిన్సిపాల్ మళ్ళీ రెట్టించాడు. గోపాలం తెగించాడు.

"అవును-పొరపాటైంది. క్షమించండి!" అన్నాడు తలవంచుకునే.

దమయంతి ఉలిక్కిపడింది. గోపాలం కేసి వెఱ్ఱిగా, అర్థనిమీలిత నేత్రాలతో చూసింది. గోపాలం సగర్వంగా మందహాసం చేశాడు. తల వంచింది దమయంతి.

ఇటువంటి కేమీ ప్రిన్సిపాల్ గమనించ

# ★ చివరకు తేలింది ★

లేదు; గమనించేలా వాళ్లిద్దరూ ప్రవర్తించ లేదు కూడా.

గోపాలం తొందరగా తప్పు ఒప్పుకున్నందుకు శాంతించాడు ప్రిన్సిపాల్.

"సరే! యిక నువ్వు వెళ్ళిపోవచ్చును. వేరే సంజాయిషీ ఏమీ చెప్పుకోనవసరం లేదు. మధ్యాహ్నం వచ్చి నోటీసుబోర్డు చూచుకో." అన్నాడు ప్రిన్సిపాల్.

గోపాలం బయటకొచ్చాడు. వస్తూవస్తూ దమయంతికేసి మరోసారి చూచాడు. దమయంతి తెల్లగా ప్రకాశించే చక్రాల్లాంటి కళ్ళతో ప్రశాంతంగా చూసింది. అంతే.

హనుమాన్లు గోపాలం వచ్చేవరకూ గేట్లోనే కాసుకుకూర్చున్నాడు. గోపాలం వచ్చి హనుమాన్లు భుజం తట్టి నవ్వాడు.

"ఎందుకు పిలిపించాడు ప్రిన్సిపాల్? నన్ను గురించిగాని ఏమయినా చెప్పిందా దమయంతి?"

గోపాలం మందహాసంచేసి, విషయం అంతా ఏకరువు పెట్టేసరికి హనుమాన్లు నిర్ఘాంతపోయాడు.

"ఇదేవిటి కథ యిలా అడ్డం తిరిగిందే? అయినా నువ్వెందుకు ఒప్పుకున్నావ్?" అన్నాడు హనుమాన్లు గోపాలం కళ్ళల్లోకి పిచ్చిగా చూస్తూ. గోపాలం మళ్ళీ నవ్వాడు.

"నీకోసం!" అన్నాడు గోపాలం.

హనుమాన్లు మౌనం వహించాడు. మౌనంగానే ఏదో ఆలోచిస్తూ నడిచాడు గోపాలంతో పాటుగా.

మధ్యాహ్నం వచ్చి నోటీసుబోర్డు చూచుకున్నారు. అందులో గోపాలం ఆశించిన మాదిరిగానే వుంది. ఏమంత పెద్ద శిక్ష కాదు. పదిహేను రూపాయల ఫైనుతో బాటు నాలుగు రోజులు సస్పెన్షన్. నిజంగా పొరపాటు గోపాలమే చేసి వుంటాడని కాలేజీ మొత్తంమీద ఎక్కువ మంది నమ్మలేకపోయారు. అయితే గోపాలం స్వయంగా ఒప్పుకున్నాడు గాబట్టి ఎవరు మాట్లాడలేకపోయారు.

* * *

హనుమాన్లుకి యిది పెద్ద సమస్యగా ఏర్పడిపోయింది. "దమయంతి ఎందుకిలా చేసింది? అదే. దే అర్థంగావడంలేదు హనుమాన్లుకి. ముఖ్యంగా గోపాలం తనమీద చూపిన ఔదార్యానికి మనస్సులో ఎంతో మెచ్చుకున్నాడు గోపాలాన్ని. తను చేసిన పొరపాటును వాడు తనంతట తానుగా తనమీద రుద్దుకుని, తనకు ఏమీ నిందరాకుండా చేశాడు. నిజంగా ఎంత సాహసం? అయితే వాడు చూపిన ఔదార్యానికి తను చూపవలసిన ప్రత్యుపకారం ఏమిటి? తను ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి నిజం ఒప్పుకుంటే? ఏమో! తనకంత సాహసం వుందా? ఏదో తొందరపడి చేశాడేగాని, పర్యవసానం ఆలోచించాడుకాడు. గోపాలం తన విషయంలో చూపిన ఔదార్యానికి మనస్సులోనే వాడికి కృతజ్ఞత తెలుపుకోగలడు. అంతకంటే మరేమీ చెయ్యడానికి తనకు ధైర్యంలేదు. తనింత పిరికిపందగా తయారయ్యాడేం? ఛీ!

హనుమాన్లు, ఆలోచనలలో పడిపోతుంటే మళ్లీ ముందు సమస్యే తట్టింది. "అయితే, దమయంతికి నిజం తెలియదా? అసంభవం-మరయితే వాడిమీద ఎందుకు రిపోర్టు చేసింది!" అదే... అదే... పాలుపోలేదు హనుమాన్లుకి.

ఇంటిదగ్గర, దమయంతిని చాలాసార్లు ఈ విషయం అడిగెయ్యాలనుకునేవాడు ధైర్యం చేసి. చాలాసార్లు దమయంతి, వాళ్ళదొడ్లో సన్నజాజిపూలు తుంపుతోంటే, చూచి, గబగబా వెళ్ళిపోయి, నాలుగూ దులిపివేద్దామనుకునేవాడు హనుమాన్లు. అయితే ఆమెను చూడగానే నోరు పెగిలేదుకాదు హనుమాన్లుకి. దమయంతిమాత్రం రెండుమూడుసార్లు ఈ ప్రవర్తన కనిపెట్టి, క్రింది పెదవి నొక్కిపట్టి గమ్మత్తుగా నవ్వేది అదే.! దాని అర్థమే అవగాహనం కాలేదు హనుమాన్లుకి...!

* * *

ఈ సంఘటన జరిగిన పదిరోజుల అనంతరం, హనుమాన్లు ఒకనాటిరాత్రి, తొమ్మిదిన్నర గంటలకు, ఒక్కడే బయట అరుగు మీద పడకకుర్చీలో కూర్చుని గోపాలం కోసం నిరీక్షిస్తూన్నాడు. గోపాలం రెండో ఆట సినిమాకు వెళదామన్నాడు.

అరుగుమీద హరికెన్‌లాంతరు వూచ నుంచి వేళ్ళాడుతూ, కునుకుతూంది. హనుమాన్లుకూడా పడకకుర్చీలో కునికిపాట్లు పడుతూన్నాడు.

అకస్మాత్తుగా, వున్నట్టుండి ఎక్కడనుండో చిన్న బెడ్డముక్క హనుమాన్లు మీద పడగానే అదిరిపడి లేచి చూచాడు. ప్రక్కయింటి వకీలుగారి అరుగుమీద

(56-వ పేజీ చూడండి)




# 11

అపూ తండ్రిమాట ప్రకారం పలకమీద పాఠం రాయటం పూర్తిచేశాడు. ఇంకేమి చెయ్యటానికి తోచక ఇంట్లోకి వెళ్ళి అక్క ఎక్కడుందా అని వెతికాడు. తల్లి భయం కొద్దీ దుర్గ ప్రొద్దున్నే తలనిండా స్నానం చేసి, లోపలగొడ్లో బొప్పాయి చెట్టుక్రింద 'పుణ్యపుక్కరిణి' నోమునోచుకొంటోంది. అక్కడ నలుచదరంగా చిన్న గుంట ఒకటి త్రవ్వి, దాని చుట్టూ నవధాన్యాలూ చల్లింది—ఆ తడి నేలని మొలకలెత్తాయి. నాలుగు వైపులా అరటి మొక్కలుపాతి, పిండితో పద్మాలూ, పత్రులు వరికంకులు, ఉదయభానుడు—రకరకాల ముగ్గులు పెట్టింది.

"ఆగు ఈ మంత్రం కాస్త చెప్పుకోవట మయాక, నిన్నొక చోటుకు తీసుకు వెడతాను" అన్నది దుర్గ.

"ఎక్కడికే అక్కా?"

"నే తీసుకువెడతానుగా, వెళ్ళాకే చూద్దువుగాని—" అని తాను చెయ్యవలసినదంతు అంతా యథావిధిగా చేసేసి—ఆనోము పాట సెమ్మదిగా గొణుక్కుంటోంది—అపూ అక్కడే వింటూ నుంచుని, ఎగతాళిగా నవ్వటం మొదలెట్టాడు.

—'నేను సతీలీలావతిని
సహోదరుడున్న భాగ్యవతిని'

దుర్గపాటఆపి, పెదిమెలమీదికి వచ్చిన నవ్వును, ముఖంలో తొణుకుతున్న సిగ్గును తమాయించుకుంటూ "ఏమిట్రాఅది, నువ్వు? వెళ్ళు, ఇక్కడ నీకేం పని?" అన్నది.

అపూ నవ్వుకుంటూ—

—'సతీలీలావతిని
సహోదరుడున్న భాగ్యవతిని—'

అని అక్కపాడిన చరణాన్ని మళ్లీ మళ్లీ అనుకుంటూ, 'హిహిహీ-సహోదరుడున్న భాగ్యవతి! హిహీ' అంటూ వెళిపోతున్నాడు.

"నీకేమిటో మహాఇదిగా ఉందల్లే ఉంది అమ్మతో చెప్పి ఆవెక్కిరింపు ఏమిటో వదిలిస్తానుండు—" అన్నది దుర్గ.

**జరిగినకథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తర వాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలవేళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లలకిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కని పిస్తుంది. ఒక రోజున ఆ ఊళ్లో భాగ్యవంతుడైన భువన ముఖర్జీ వదినగారు అపూవాళ్ళ ఇంటికి వచ్చి, తమ మామిడిచెట్ల పిందెలన్నీ దుర్గ దొంగతనంగా కోసుకుపోతోందనీ, తమ ఇంట్లో పిల్లలాడుకునే పూసలదండ ఎత్తుకువచ్చిందనీ సర్వజయతో ఫిర్యాదుచేసి జగడమాడుతుంది. ఈ అవమానం భరించలేక సర్వజయ కూతుర్ని పట్టుకుని చావబాదుతుంది. దుర్గ దెబ్బలు తిని యింట్లోంచి పారిపోతుంది. అక్కకి దెబ్బలు తగిలాయని అపూ ఎంతో బాధపడ్డాడు. అక్కమీద వాడికి ఎక్కడలేని ఆపేక్ష కలిగింది.

అనువాదం: మద్దిపట్ల సూరి



"పథేర్ పాంచాలి"ని మనోహర చిత్రంగా తీసిన దర్శకుడు సత్యజిత్ రాయ్ వదేళ్ల క్రితం ఆ నవలలో ఒక ఘట్టానికి చేసిన రూపకల్పన.

ఫెళ ఫెళ ఉరుము, మెరుపు రావటంతో అడవి అంతా ఒక్క-రెప్పపాటు వెలుతురమయిపోయింది. 'అక్కా' అంటూ అప్పూ భయంతో దుర్గని కౌగలించుకున్నాడు. (20-వ పేజీ)

# ★ పథేర్ పాంచాలి ★

స్కూలు అయిపోయాక-పద, కందకం చెరువుకి పోదాం పద. భోందూ వాళ్ళమ్మ చెప్పింది. అందులో పానిపళ్లు కావలసినన్ని ఉన్నాయట, తెచ్చుకుందాం—" అన్నది దుర్గ.

ఊరికి దిన్నగా ఉత్తరపువైపున ఉన్న వెదురుతోపు, మామిడితోపుల మధ్యనుంచి వెళ్ళాలి అక్కడికి. తోపులు దాటిపోయాక ఆ చెరువు. ఆదికాలం నాడెప్పుడో మజుందార్లు లోగిలిచుట్టూ కందకం త్రవ్వించుకుని కాపురం ఉండేవారు. ఆ కందకమే పెద్ద చెరువులా తయారయిందిప్పుడు- మున్నూట అరవై రోజులూ నీళ్ళుండేది ఈ ఒక్క చెరువులోనే. మజుందార్ల లోగిలి తాలూకు చిహ్నం లేవీ లేవు ఇప్పుడు—అంతా నీటి మయం. దీన్నే కందకం చెరువు అంటారందరూ.

అక్కడికి వెళ్ళిచూస్తే 'వెలుపులో' పాని పళ్లు నిజంగా చాలా ఉన్నాయి. కాని ఒడ్డుకి దగ్గరలో అట్టే లేవు. కొంచెంలోతుకు వెడితేనే గాని అందవు అవి. "అప్పూ, ఎక్కడయినా ఓ వెదురుచువ్వ ఉందేమో చూడరా, దాంతో ఇవతలికి లాగి అందుకుందాం!" అన్నది దుర్గ. తర్వాత చెరువు వొడ్డున గుబురుగా ఉన్న చెట్లలోంచి బాగా పండిన శాఖోటకపు పళ్లు కోసుకుని తినసాగింది. అప్పూ వెదురుచువ్వకోసం వెతుకుతూ వెతుకుతూ, అది చూసి, "ఛా, ఛా, ఆ పళ్లు తినకు అక్కా! ఆ పళ్లు మనుషులు తింటారా ఎక్కడైనా—పక్షులు తింటాయికాని—" అన్నాడు.

దుర్గ బాగా పండిన పళ్లలోంచి గింజలు లాగేస్తూ "ఇటు రా, తినిచూడు, బెల్లంలా ఎంత తియ్యగా ఉన్నాయో! ఎవరు చెప్పింది తినకూడదని? నేనెన్నిసార్లు తిన్నాను!" అన్నది.

అప్పూ వెదురుచువ్వ, చూరకత్తి అక్కడ పెట్టేసి, అక్క దగ్గరకు వచ్చి, "తింటే పిచ్చెత్తుతుం దంటారుగా! ఏదీ ఒకటి నాకు పెట్టు చూస్తాను—" అన్నాడు.

నాలా పండు నోట్లో వేసుకుని, ముఖం చిట్లించి "కాస్త చిరుచేదుగా ఉందే అక్కా!" అన్నాడు.

"ఆ కాస్త చిరుచేదుగా ఉంటేనూ మరి! ఉంటే మాత్రం ఏం, ఎంత రుచిగా వున్నాయో చూచావా?" అంటూ దుర్గ ఓగుప్పెడు పళ్లు తీసుకుని నోట్లో వేసుకుంది.

పుట్టినప్పటినుంచీ వీళ్లు మంచి మంచి తినుబండారాలు రుచిచూచినవాళ్లు కారు. కాని భూమిపై పుట్టి అల్పకాలమే అయినందువల్ల, వీళ్ళ జిహ్వకి రుచులన్నీ కొత్తే. పృథ్విలో లభ్యమయ్యే సకల రసాలీన్నీ, ముఖ్యంగా మధురరసాన్నీ ఆస్వాదించాలనే చాపల్యం వీళ్ళకి అధికం. లక్ష్మి, సందేశ్, జిలేబీలు కొనుక్కుని తినే తృప్తిపొందే యోగం వీళ్లకి పట్టలేదు. ఇంక ప్రకృతి అనంత సంపదలో వనలతా వృక్షాలు ఇచ్చే క్షుద్రమధుర రసాన్ని లోభంతో ఆస్వాదించే ఈ దరిద్ర బాల బాలికల కోసమే కాబోలు, జాలిగల తల్లి వనలక్ష్మి ఈ వృక్షాల్లా లతల పండ్లూ పుష్పాలను మధుర రసంతో నింపి వేసింది.

కొంచెం సేపయాక, దుర్గ కొంచెం నీళ్ళలోకి దిగి, "అబ్బ! ఎన్ని తామర పూలున్నాయిరా అప్పూ! కొస్తాను ఉండు" అంటూ ఇంకా కొంచెం ముందుకు వెళ్లి రెండు పూలు లాగి గట్టుమీదికి విసిరేస్తూ పళ్లు కోరా అప్పూ అన్నది... "మరి పానిపళ్లు చాలా లోతుకి వెడితేగాని అందేట్టు లేవు. అంతలోతుకి ఎలా వెడతావ్ అక్కా?" అని అడిగాడు అప్పూ. దుర్గ వెదురు చువ్వతో ఆ పళ్లున్న తీగను ఇవతలికిలాగలేక పోయింది. "ఈ చెరువు-బెదవది, తగనిలోతురా, మునిగి పోతానేమో, ఎలా అందుతాయి అవి? నువ్వొక పనిచెయ్యి పోనీ నా కోకకొంగు గట్టిగా లాగిపట్టుకుని నుంచో. నేనీ చువ్వతోనే లాగిచూస్తాను, అందుతాయేమో!" అన్నది దుర్గ.

ఆ చెట్లలో ఓమూల చెట్టు కొమ్మచివర పసుపుపచ్చని పిట్టొకటి రెక్కల్లో లాడిస్తూ ఈలవేస్తున్నట్టు తమాషాగా కూస్తోంది. అప్పూ దానికేసి చూసి చూసి, "ఏంపిట్టే అక్కా అది" అని అడిగాడు.

"పిట్టలు-గిట్టలు సంగతి అలా ఉంచు. కొంగు గట్టిగా లాగిపట్టుకో. మునిగిపోతాను సుమా""...అన్నది దుర్గ.

అపూ వెనకనుంచి లాగిపట్టుకున్నాడు. దుర్గ కాస్తకాస్త ముందుకి జరుగుతూ చేతిలో చువ్వను అందినంతదూరం పోనిచ్చింది. గుడ్డలు తడిసిపోయాయి కాని ఆ పళ్లున్న తీగమాత్రం అందలేదు. ఇంకొంచెంముందుకు వెళ్ళి ఆ చువ్వచివరను మునివేళ్ళతో మాత్రం పట్టుకుని, మళ్ళీ అందుకోబోయింది. అపూ తన చేతిలోంచి పట్టు జారిపోతున్నదని గ్రహించి కిలకిలనవ్వాడు. ఆ నవ్వుతోపాటు చేతిలోంచి కొంగుజారిపోయింది. దుర్గ ముందుకు పడబోయి, ఎలాగో తమాయించుకుని నవ్వుతూ "పోరా ఇందుకు పనికివస్తావ్ నువ్వు? మళ్ళీ పట్టుకో ఎంకోసారి" అంటూ మొత్తానికి ఎలాగయితేయేం ఓ పళ్లగుత్తి ఉన్న తీగను ఇవతలికి లాగి, 'ఎన్నిపళ్లున్నాయో' అని సంబరపడుతూ చూస్తూ, గట్టుమీదికి విసిరేసి, 'చాలా పచ్చిగాఉన్నాయిరా ఇంకా పాలు పోసుకోలేదు బాగా, ఇంకోసారి పట్టుకుంటావ్ ?" అన్నది దుర్గ. అపూ మళ్ళీ కొంగులాగి పట్టుకున్నాడు. కొంచెం సేపయాక అక్క ఒక్కొక్క అడుగే ముందుకు వెడుతూంటే ఆ లాగుడుకు అపూ కూడా కొంచెం కొంచెం నీళ్లలోకి వచ్చేయ్యాక తప్పిందికాదు. ఆ రావటంతో లాగూ తడిసిపోయి, పట్టువదిలిపెట్టి కిలకిల నవ్వటం మొదలెట్టాడు.

"పోరా" అంటూ దుర్గకూడా నవ్వింది.

"అక్కా - తమ్ముళ్ల కిలకిల ధ్వనులతో కాసేపు నిర్జనమైన ఆ వెదురుతోపు ప్రతిధ్వనించిపోయింది.

"ఒంట్లో ఊపిరి అంటూ వుంటేగా ఏమయినా. ఎందుకూ కొరగాని వాడివి యొక్కడో" అన్నది దుర్గ.

కాసేపు ఉన్నాక దుర్గ మరోసారి నీళ్ళలోకి దిగి ప్రయత్నించి చూస్తోంది. అపూ ఒడ్డున నుంచుని ఉన్నాడు. ఇంతలో అపూ చటుక్కున దగ్గరలో ఉన్న శాఖోటకపు చెట్టువైపు వేలితో చూపిస్తూ—"అక్కా! అక్కా! చూడు అది—"అంటూ గబగబా వచ్చి క్రిందనుంచి ఏమిటో తీశాడు పైకి.

దుర్గ నీళ్లలో నుంచునే "ఏమిట్రా అది" అని అడిగి, తర్వాత గట్టు యెక్కి తమ్ముడి దగ్గరకు వచ్చింది.

అపూ అప్పటికే మట్టి అంతా కుళ్లగించి ఏమిటో పైకితీసి, దాన్ని చొక్కాతో తుడిచి శుభ్రంచేస్తున్నాడు. దాన్ని స్వంతం చేసుకుని, ఎంతో సంతోషంతో అక్కకు చూపిస్తూ "తళతళలాడుతోంది చూడు అక్కా! ఏమిటంటావు ఇది?" అని అడిగాడు.

దుర్గ దాన్ని చేతులోకి తీసుకుని చూసింది. ఒకవైపు గుండ్రంగా మొనతేలి, రెండోవైపున అంచు చెక్కినట్లుంది. దుర్గ దాన్ని కాసేపు రకరకాలుగా త్రిప్పి త్రిప్పి చూసింది, ఎంతో ఆసక్తితో...

హఠాత్తుగా ఏమని తట్టిందో మనస్సుకు, జుట్టంతా రేగి ముందుకుపడి చిందరవందరగా ఉన్న ఆ పిల్ల మొహం ఇంతయింది. ఎవరైనా చూస్తున్నారేమో అని భయం భయంగా చుట్టూ పరికించి చూసింది. రహస్యంగా—"ఒరే అపూ! వజ్రమల్లే ఉందిరా ఇది. ఊరుకో, బిగ్గరగా మాట్లాడకు" అంటూ మళ్లీ భయంతో చుట్టూ ఇంకొకసారి చూసింది.

అపూ అక్కకేసి గ్రుడ్లప్పగించి చూస్తూ ఊరుకున్నాడు. వజ్రం అనేది వస్తుతః వాడికి తెలియనిదేమీ కాదు—కథల్లో రాజపుత్రులు ధరించే హారాల్లో, వాటిల్లో వజ్రాలు వుంటాయనివాళ్ల అమ్మ,అక్క ఎన్నోసార్లు చెప్పగా విన్నాడు. కాని వజ్రం చూపులకు ఎలా ఉంటుందీ అన్న విషయంలోమాత్రం వాడికొక భ్రాంతి కద్దు. అదేదో పసుపు పచ్చగా మెత్తగాకాదు మళ్ళీ-కాస్తంత గట్టిగానే ఉంటుందని వాడి ఊహ.

సర్వజయ ఇంటిదగ్గర లేదు. పొరుగింటి నుంచి వచ్చి చూసేసరికి పిల్లలిద్దరూ లోపలి గుమ్మందగ్గర నుంచుని ఉన్నారు. దగ్గరకు రాగానే దుర్గ మెల్లిగా—"మాకొకటి దొరికిందే అమ్మా! కందకం చెర్వుకి పానిపళ్లు తెచ్చుకుందామని వెళ్ళాం. అక్కడ ఒడ్డున పొదల దగ్గర మట్టిలో కూరుకుపోయి వుంది ఇది అని చెప్పింది."

"ముందు నేనే చూసి, అక్కతో చెప్పానే అమ్మా!" అన్నాడు అపూ.

దుర్గ కొంగుముడి విప్పి, దాన్ని తల్లి చేతికిస్తూ "ఇది ఏమిటో చూడు అమ్మా!" అన్నది. సర్వజయ దాన్ని అటూ యిటూ త్రిప్పిచూసింది.

దుర్గ రహస్యంగా "ఇదినిజంగా వజ్రమే అమ్మా! కాదూ ?" అని అడిగింది.

వజ్రం ఎలా ఉంటేదీ సర్వజయకైనా వాళ్లకంటె స్పష్టంగా తెలియదు. ఆమె అనుమానిస్తూ "వజ్రమని నీకెలా తెలుసే ?" అని అడిగింది.

"ముజుందార్లు చాలా భాగ్యవంతులు కదా! వాళ్ళస్థలంలో అడివిలో ఎవరికో మొహిలరీపోగు దొరికిందిటగా-అత్త చెప్పేది. ఇదికూడా ఆ చెరువఒడ్డున అడవిలో మన్నులో కూరుకుపోయి ఉంది. ఎండ తగిలేసరికి తళతళ లాడింది. ఇది నిజంగా వజ్రమేనా అమ్మా!" అన్నది దుర్గ.

"మీ నాన్నను రానియ్,చూపించవచ్చు" అన్నది తల్లి.

దుర్గ మెల్లాలోకి వచ్చి సంతోషం పట్టలేక తమ్ముడితో- "వజ్రమేకనుక అయితే, మనం ఎంత భాగ్యవంతులం అయిపోతామో చూడు" అన్నది.

అపూ అది అర్థంచేసుకోలేక అమాయకంగా నవ్వాడు.

పిల్లలిద్దరూ వెళ్లిపోయాక సర్వజయ ఆ వస్తువును మరొకసారి పరీక్షగా చూసింది. ఒకవైపున బల్లపరుపుగానూ, మరొకవైపున గుండ్రంగా గుబ్బలాగా-కుంకుంభరిణె మూతలాగా ఉంది. భలే తళతళలాడుతోంది. సర్వజయకు అందులో ఏవో చాలారంగులు కన్పిస్తున్నట్లు తోచింది. ఏమయినా గాజు పెంకుమాత్రం అయిఉండదు. అంతవరకు రూఢి. ఇలాంటి గాజుముక్కను ఇదివరకెప్పుడూ చూసిన జ్ఞాపకం లేదామెకి. చటుక్కున ఆమెకి శరీరంలో ఏదో ప్రవాహం పరుగిడుతున్నట్లనిపించింది. క్షణక్షణానికీ రేకెత్తుతున్న సందేహాలన్నిటినీ అణచిపెట్టి ఆమె మనస్సులో అంతులేని దురాశ ఒకటి తొంగిచూస్తోంది- 'నిజంగానే ఇది వజ్రమయితే, అప్పుడిహ-'

వజ్రమంటే ఏదో పాముశిరస్సున ఉండే మణిలాగానో, స్పర్శమణిలాగానో ఉంటుందని ఆమె అంచనా. ఏదో కథల్లో చెప్పటమేకాని, నిజంగా అంతపెద్ద వజ్రాలు

టాయా! నిజంగా ఉంటే, అదొక్క వజ్రమయితే చాలు, దాంతో ప్రపంచైశ్వర్యంలో ఒకవాటా కొనెయ్యొచ్చు.

కొంతసేపటికి చిన్నమూట ఒకటి చేతపట్టుకొని హరిహరు డింటికి వచ్చాడు.

"ఇదిగో! ఇలా రండొకసారి. ఇదేమిటో చూడండి కాస్త" అన్నది సర్వజయ.

హరిహరుడు దాన్ని అందుకుని, "ఎక్కడ దొరికిందిది?" అని అడిగాడు.

"దుర్గ కందకం చెరువుదగ్గరకు వెడితే—అక్కడ దొరికింది దానికి. ఏమిటంటారు?"

"హరిహరుడు దాన్ని అటుత్రిప్పి, ఇటుత్రిప్పిచూసి. గాజుముక్క కాని, లేదా ఇంకేదైనా రాయిగాని అయిఉంటుంది. ఇలాంటి వస్తువులు నాకు అంతబాగా తెలియవు" అన్నాడు.

సర్వజయకి మనస్సులో రవంత ఆశ పొడచూపింది. గాజుముక్కే అయితే తనభర్త కనుక్కోలేకపోతాడా! తర్వాత మెల్లిగా—భర్త మళ్లీ అదేమీకాదులే అని అనిపోతాడేమో అన్న భయంతో—"వజ్రంకాదంటారా? ముజుందారుగారి చెరువుదగ్గర ఎంతోమందికి ఎన్నెన్నో దొరికాయట. దుర్గ చెపుతూ ఉంటుంది: ఒకవేళ వజ్రమే అయితే?" అన్నది.

"ఆ వజ్రాలు ఇలా వీధిలోనూ ఒడ్డుమీదా దొరికితే, ఇంకనుకోడంఎందుకు? నువ్వూ మొత్తానికి భలేదానివేనే!" అన్నాడు. అతడి ఉద్దేశ్యంమాత్రం అది గాజుముక్క అనే. మళ్లీ మరుక్షణంలోనే "అయితే అవునేమో! ఏంచెప్పగలం? ముజుందార్లు గొప్ప భాగ్యవంతులేమరి. కాని చిత్రం ఏమిటంటే ఏకాలంలోనో వాళ్లు నగల్లో వేయించుకున్నది మట్టిలోకి ఎలా వచ్చిందో! ఏదోసామెత చెప్పతారే-నొష్టని రాసిపెట్టి లేకపోతే, రత్నం చేతచిక్కినా రాతిముక్క అనుకుంటారుట! చివరికి దరిద్ర బ్రాహ్మడి కథలా కాదుకదా......సరే, ఉండు, ఒకసారి గంగూలీవాళ్లి యింటికెళ్లి చూపించివస్తాను" అన్నాడు.

సర్వజయ వంటచేసుకుంటూ చేసుకుంటూ మనసులో ఎన్నోమొక్కులు మొక్కుకుంది. 'లోకంలో ఎంతమందికి ఎన్ని దొరకటంలేదు భగవాన్! అష్టకష్టాలు పడుతూకూడా సంసారాన్ని ఈదలేక పోతున్నా. నా బిడ్డల మొహాలు చూసి అయినా కనికరించు భగవాన్; కోటిదణ్ణాలు నీకు...'

ఆమెకి గుండె దడదడలాడసాగింది.

కొంచెంసేపు పోయాక దుర్గవచ్చి—"ఇంకా నాన్న రాలేదల్లే ఉందే! అవునా అమ్మా?" అని అడిగింది.

హరిహరుడు లోపలికి వస్తూనే "ఇది అలాంటిదేమీ కాదని నేను మొదట్లోనే చెప్పాగా! గంగూలీగారి అల్లుడు సత్యవాన్‌రాయి కలకత్తానుంచి వచ్చాడు. అతడు దీన్ని చూసి, ఇది ఒకరకం బిల్లోరీ అద్దం అని చెప్పాడు. దారుల్లో డొంకల్లో వజ్రాలు దొరికితే ఇంకేం! నువ్వూ మొత్తానికి భలేదానివేనే" అన్నాడు.

## 12

వైశాఖమాసపు రోజులు. జాము—జామున్నర ప్రొద్దెక్కింది. సర్వజయ వంటచేసుకుంటూ, చేతికింద పెట్టుకున్న పోపులపెట్టెలో వస్తువులు తడుముకుంటూ 'మళ్ళీ జీలకర్ర, మిరియాల డబ్బాలు ఎత్తుకొని ఎక్కడికి పారిపోయావురా? మహా వేధించేస్తున్నావురా నన్ను! వంటచేసుకోనివ్వవురా? మళ్ళీ ఇప్పుడేవచ్చి ఆకలి ఆకలి అంటూ కూర్చుంటావ్!' అంటూ విసుక్కుంది.

అపూ అయిపులేడు.

"మా నాన్నవికదూ! ఇచ్చివెళ్లు. మంచివాడివికదూ! ఎందుకు చెప్పు నన్నిలా వేధించటం? ఎంత ప్రొద్దెక్కిందో చూశావా?"

అపూ వంటయింటి గుమ్మంచాటునుంచి తొంగిచూశాడు. తల్లి తనవైపు చూడగానే వాడి కొంటె నవ్వుమొహం గబుక్కున మళ్ళీ తలుపుచాటున మాయమైంది.

"ఎందుకురా బాబూ! మిట్టమధ్యాహ్నమప్పుడు విసిగిస్తావ్? ఇచ్చివెళ్లు—" అని బ్రతిమాలింది సర్వజయ.

అపూ అలాగే కొంటెగా నవ్వుతూ మరోసారి తొంగిచూశాడు.

"ఆ. చూశాలే నేను. ఇంకెందుకు దాక్కోవటం? ఇచ్చివెళ్లు యిహ—"

సర్వజయకి తనబిడ్డ ఎలాంటివాడైందీ తెలుసు. అపూ ఏణ్ణర్థం పిల్లవాడుగా వున్నప్పుడు చూపులకిప్పటికంటె తెల్లగావుండేవాడు. సర్వజయకి బాగా జ్ఞాపకం—చక్రాలలాంటి వాడికళ్ళకు చక్కగా కాటుకపెట్టి, ముఖాన చుక్కపెట్టితలకి, చవకబారు ఊదారంగు ఊలుటోపీ పెట్టి, సాయంకాలమప్పుడు వీధివైపు వసారాలో ఒళ్లో పడుకోపెట్టుకుకూర్చుని వాడిని నిద్రపుచ్చుదామని—

"బూచాడ రారా - బుట్టల్లి తేరా,
బుట్టలో మా అబ్బాయిని -
వేసుకునిపోరా—"

అని [illegible]టం మొదలెట్టేది.

[illegible]లూ వాడూ-'ఆ.' అంటూ తల్లి [illegible]హంలో మొహం పెట్టి చూచేవాడు. తర్వాత వాడికేం తోచలేదు. బోసినోరంతా విప్పి ఉక్కిరి బిక్కిరయేట్లు నవ్వుతూ—లేచి దూరంగా పారిపోయేవాడు. మళ్లీ అప్పుడే మట్టికాళ్లతో వచ్చి, తన బుల్లిబుల్లి కాళ్లతో తల్లిని పెనవైచుకుని, ముఖాన్ని ఆమె వీపువెనక దాచుకునేవాడు. సర్వజయ నవ్వుతూ—"అరె! అరె! మళ్లీ ఎక్కడ దాక్కున్నావురా: కనపడటంలేదే నాకు, అమ్మపిల్లాడా!..." అంటూ వాడి ముఖంకేసి తల త్రిప్పగానే-వాడూ మళ్లీ నవ్వుతూ ముఖం ముందుకు త్రిప్పుకునేవాడు. మళ్లీ అమాయికంగా నవ్వుతూ తల్లి భుజంమీద ముఖం వాల్చేవాడు. సర్వజయ-"ఏడీ: మళ్లీ ఎటు పోయాడమ్మా! మళ్లీ ఎటో పరుగెత్తినట్లున్నాడే" అని అన్నకొద్దీ వాడికి ఆటలు జాస్తి అయేవి. మాటిమాటికి అటూ ఇటూ త్రిప్పటంలో తల్లికి మెడ నొప్పెట్టినా వాడుమాత్రం ఆటలు మానేవాడుకాడు. వాడు అప్పుడే క్రొత్తగా ప్రపంచంలో అడుగు పెట్టినవాడు. ప్రపంచంలో తరిగిపోని ఆనందభాండారంలోని అణువొకటి చేతికి అందింది ఆ పసివాడికి. దాన్ని వాపిరిగొట్టులా ఎంత ఆస్వాదించినా తనివి తీరకుండా ఉంది ఆ అమాయిక హృదయానికి. అలాంటప్పుడు వాణ్ణి వారించటం తల్లికైతేమాత్రం తరమా? కొంతసేపు ఇలా ఆడగా ఆడగా వాడికి అలసటవచ్చేది. దాంతో వాడు ఉన్నట్టుండి ఆవలిస్తూ పరధ్యానంలో పడిపోయేవాడు. సర్వజయ చిన్న చిన్న చిటికెలు వేస్తూ "అదుగో, ఆడి ఆడి అలిసిపోయేసరికి వెర్రినాన్నకి అప్పుడే నిద్రొచ్చేసింది" అనుకునేది. తర్వాత బొట్టు, కాటుకపెట్టిన వాడి ముద్దొచ్చే ముఖంకేసి ఒళ్లు మరిచి చూసిచూసి, చటుక్కున ఆపాలబుగ్గల్ని ముద్దులతో నింపేసేది. కాని తల్లి చూపుతున్న ఈ అపేక్షంతా తనకేమీ పట్టనట్లు ఆ పసివాడికి కళ్లుకూరుకొచ్చేవి. సర్వజయ మెల్లిగా పిల్లవాణ్ని బుజాన వేసుకుంటూ, ఈ సందెవేళ ఇదేం నిద్రమ్మా వీడికి? ఇంకాసేపు పోయాక దీపాలు పెట్టగానే పాలుపట్టి నిద్రబుచ్చుదామనుకున్నాను నేను అనుకునేది.

పిల్లవాడికి ఎనిమిదోయేడు వస్తేమాత్రం ఏం! వెనక పసితనంలోలాగానే అమ్మతో దాగుడుమూత లాడుకునే సక్తి వాడికింకా తీరలే"దన్న సంగతి సర్వజయకి తెలుసు.

వాడిలా దాక్కునే చోట్లన్నీ కళ్ళు మూసుకున్నా కనుక్కోగలరు. కాని సర్వజయ చూసికూడా చూడనట్లుండేది. అక్కడే కూర్చుని అటూ ఇటూ చూస్తూ "అరె! ఎటువెళ్ళాడు! కనుక్కోలేకపోయాను!" అనేది.

'అమ్మను ఊరికే మాయపుచ్చేసెయ్యొచ్చు! అమ్మతో ఇలాఆడుకోవటం ఎంత బావుంటుంది!' అనుకునేవాడు అపూ.

తానుకూడా వాడితోపాటు ఆడుకుంటున్నట్లుంటే-వాడు రోజల్లా ఇలాగే ఆడిస్తాడని సర్వజయకి తెలుసు-అంచేత కొంచెం బెదిరింపుగా "అయితే ఇహ వంటా చెయ్యను ఏం చెయ్యనులే. అపూ! ఇప్పటికయినా నామాట విను. నీకు అన్నం కావాలంటే చప్పున అవి ఇలా తెచ్చి ఇయ్యి - లేదా-" అన్నది సర్వజయ.

అపూ నవ్వుతూ తాను దాచిన చోటునుంచి ఆ డబ్బాలు తీసుకువచ్చి తల్లిముందు పెట్టాడు.

"ఊఁ. ఇహ కాసేపు అలా బయటికి వెళ్ళి ఆడుకో. అక్క ఎక్కడికి వెళ్ళిందో చూడు కాస్త. ఆ గంగరావిచెట్టుదగ్గర నుంచుని కాస్త గట్టిగా కేకెయ్యి. అది ఇవాళ తలంటిపోసుకోవలసినరోజు. అస్తమానం ఊరిమీద తిరగటమేనాయె - ఎక్కడని పట్టుకోగలను. వెళ్ళిరా, మా నాయన కదూ!" అన్నది వాళ్ళమ్మ.

కాని తల్లిమాట విని బుద్ధిమంతుడనిపించుకోవాలనే కోరిక వాడిలో ఏమాత్రం కనిపించలేదు. వాడు తల్లివెనకాలే వెళ్ళి ఏవో చెయ్యసాగాడు.

ఊఁ-ఊఁ-ఊఁ-ఉమ్—

సర్వజయ వెనక్కి తిరిగిచూచేసరికి అపూ గడమంచెమీద పిడకలేసుకోటానికని పెట్టి ఉంచిన పాత గోనెసంచి తెచ్చి ముసుగు వేసుకుని కూర్చునివున్నాడు క్రింద...

"అయ్యో, అయ్యో ఏంపనిరా అది ఎన్నియుగాలనాటినుంచో దులపకుండా పెట్టిన గోనెరా అది. ఎక్కడలేని దుమ్మూ దాన్నే ఉంది. పారెయ్, తీసిపారెయ్, అందులో ఏ తేళ్ళో, జెర్రిలో కూడా ఉంటాయి. తాతలనాటినుంచి మూలపారేసి పెట్టిన సంచీ అది!"

"ఊఁ. ఊఁ. ఊఁ హుమ్-"

"ఊహూఁ. నేను చెప్పేనమాట విను. నా తండ్రి కదూ. నా బంగారుకొండ కదూ. దాన్ని అక్కడ పారెయ్, కొరవు చెయ్యవాడి. అల్లరి చెయ్యకు మరి, ఛా."

వాడు ఆ గోనె ముసుగుతోనే తెండడుగులు ముందుకు వేశాడు. "మీదిమీదికి రాకు, రావద్దు నాన్నా. భయం, భయం, అమ్మో! నాకెంత భయం వేస్తోందనుకున్నావ్!" అన్నది సర్వజయ.

అపూ 'హీ హీ హీ' అని నవ్వుతూ ఆ గోనెసంచి తీసి అవతలపెట్టాడు. వాడి తల, కళ్ళు, మొహం, చెవులు అంతా ఒకటే దుమ్ము. వాడు ముఖం వికృతంగా పెట్టి, పళ్ళు ఇకిలించాడు.

"మళ్ళీ అదేమిటిరా? ఒంటినిండా దుమ్మునువ్వు భూతంలా ఎలా తయారయావో? మాంధాతలనాటినుంచి పేరుకున్న దుమ్ము. నువ్వొక్కడివో ఒట్టి పిచ్చివాడివిలాగున్నావే!"

ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని ఉన్న బిడ్డకేసి చూస్తుంటే సర్వజయకి ఆపేక్ష పొర్లుకొచ్చింది. కాని వాడివి పాచికుడ్డలు, నీళ్ళు పోసుకోందే వాడినెలా ముట్టుకోవటం, అనే ఉద్దేశ్యంతో-"ఈ తువాలా తీసుకుని ముందు ఒళ్ళంతా శుభ్రంగా తుడుచుకో. నువ్వొక్కడివాడివిరా నాకు?" అన్నది.

కొంచెం సేపయాక పిల్లవాణ్ణి వంటింట్లో కాకులు రాకుండా కాపలా కూర్చోపెట్టి సర్వజయ నీళ్ళు తెచ్చుకోటానికి బయటికి వెడుతూ; దుర్గ గుమ్మంలోంచి లోపలికి రావటం చూసింది. ఆ పిల్ల ముఖమంతా ఎండకి కందిపోయి, జుట్టంతా రేగిపోయింది. ఆ మట్టి కాళ్ళకి మాత్రం లత్తుక పెట్టుకుంది. చటుక్కున తల్లి ఎదుట పడటంతో చెంగున ఉన్న మామిడికాయల మూట చూపిస్తూ, గుటకలు మింగుతూ-"పుణ్యపుష్కరిణి" నోముకు సెనగచెట్టు తెద్దామని రాజీ వాళ్ళఇంటికి వెళ్ళానమ్మా. తట్టనిండి పోయి కానిని మిగిలితే రాజీ అత్త ఇచ్చిందీ కాయలు" అన్నది.

"ఆ, ఆవాలకం చూడాలి-దరిద్రం ఓసుకుంటూ. అతల, జుట్టు చూస్తేచాలు జనుపు జ్వరం వస్తుంది. పుణ్యపుష్కరిణి నోము తెంగమూలంగానే రాత్రిళ్ళు పాపం నీకు నిద్రకూడా పట్టటంలేదల్లేవుంది:" అని అమ్మాయి పాదాలకేసిచూసి, "మళ్ళీ అమ్మవారిదగ్గర భరిణెలో లత్తుక తెచ్చి పూసుకున్నావల్లేవుంది" అన్నది.

దుర్గ ఓణీకొంగుతో ముఖం తుడుచుకుని ముఖంమీద పడుతున్న జుట్టును వెనక్కి వేళ్ళతో గిరుకుని, "అమ్మవారిదగ్గిర భరిణెలో లత్తుక ఎందుకయిందీ! నాన్న సంతకి వెళ్ళినప్పుడు అర్ధణాపెట్టి తెప్పించుకోలేదూ నేను: ఆ లత్తుకేగా నా బొమ్మల పెట్టెలో ఉన్నదినాన్నగారినుంచి!" అన్నది.

హరిహరుడు హుక్కాలో నిప్పు వేయించుకుందామని గుమ్మంలోకి వచ్చాడు.

"గడియగడియకీ ఎక్కడనుంచి వస్తుంది నిప్పు? ఆరనికర్ర లేకపోతే ఉంటే అంటించి

"మిత్రమా! ఈ మధ్య నాకు డబ్బిబ్బంది ఇంతా అంతా కాదనుకో. ఇవ్వాళ సాయంత్రంలోగా పది రూపాయలు కావాలి. ఎలాగా అని చూస్తున్నాను."

"బతికించావు. ఇంకా నన్నడగబోతున్నావేమోనని భయపడ్డాను. మంచిదే, చూస్తూఉండు."

ఉంచుకోరాదూ? వెదురుకర్రల నిప్పు ఎంతసేపని ఆరిపోకుండా ఉంటుందీ-తుణతుణానికి అడిగినప్పుడల్లా మీకు అందించటానికి?" అని విసుక్కుంటూ ఇనుపచట్రంతో రెండు బొగ్గులు తెచ్చి అందించింది. తర్వాత కంఠం సాత్వికంగా మార్చుకుని-"ఆ సంగతి ఏమైంది?" అని అడిగింది.

"ఇంచుమించు అంతా నిశ్చయమైపోయినట్లే. ఇంటిల్లిపాదీ ఉపదేశం అవుదామని అనుకున్నారుగా! కాని ఒకచిక్కు వచ్చిపడింది. మహేశ్ బిశ్వాశ్ అత్తవారి ఆస్తి విషయమై ఏవోతగాదాలు ప్రారంభమైనాయి బిశ్వాశ్ గారు అక్కడికి వెళ్ళారు-అసలు ప్రధానవ్యక్తి అతడేమరి! అంచేత కొంచెం వెనక్కిపోయిందాసంగతి. అదట్లా ఉండగా ఆషాఢమాసం దాకా మూఢమికూడా ఒకటి అడ్డువచ్చిందిగా!"

"అయితే మరిస్థలమూ ఇల్లూకూడా ఇస్తామన్నారుగా, అదేమయింది?"

"అదే వచ్చిన చిక్కు: వాళ్ళు ఉపదేశం అవటం వెనక్కిపోయినప్పుడిహ ఈ ప్రసక్తి ఎలా తీసుకురావటం?"

సర్వజయ ఎన్నో ఆశలు పెట్టుకుని ఉంది-ఈ సంగతి వినగానే ఆమెకి చాలా ఆశాభంగం కలిగింది. "పోనీ అక్కడ కాకపోతే ఇంకెక్కడైనా చూడరాదూ? ఇక్కడేముంది మనకు? మామిడిపళ్ళూ, పనసపళ్ళూ

వచ్చే రోజులు ఇవి: ఇంట్లో వాడవిటికైనా ఒక్క కాయ లేదు. ఇవాళ అమ్మాయి ఎవ రింట్లోనుంచో రెండు కాయలు తీసుకు వచ్చింది" అని ఆ యింటి వైపు తిరిగి-"ఈ దొడ్డి గుమ్మం ముందునుంచి ఆ తోటలోంచి రోజూ తట్టలకు తట్టలు తీసుకు పోతూ ఉంటారు-పిల్లలు ఎప్పుడూ కళ్ళప్పగించి వాటి కేసే చూస్తూ నుంచుంటున్నారు-ఎంత బాధగా ఉంటుందంటారది?" అన్నది.

తోట మాట రాగానే హరిహరుడు-"వాళ్లు మాత్రం తక్కువ దగుల్బాజీ లను కున్నావా? ఏడాదికి పాతిక రూపాయలు శిస్తుకింద ఇచ్చేట్లు రాయించి వేసుకున్నారు. నేను వెళ్లి- 'పిల్లా జెల్లా కలవాణ్ణి నేను. మా పిల్లలు ఈ తోటలో మామిడిచెట్లకింద, జామ చెట్లకింద పెరిగినవాళ్లు. వేరే ఏ ఆధారమూ లేనివాణ్ణి. మా దాయాదులతోటకూడా కదా ఇది! భగవంతుని దయవల్ల తమకి ఎలాంటి లోటూ లేదు. రెండు పెద్ద తోటలుకూడా ఉన్నాయి. మామిళ్లు, జామలు, పనసలు, కొబ్బర్లు-వేటికి తక్కువ మీకు? ఆ తోట నాకు వదిలెయ్యండి' అని ఎన్నో విధాల బ్రతిమాలాను. ఆయ నేమన్నాడో తెలుసా, నీలమణి అన్నయ్య బ్రతికుండగా తన దగ్గర మూడు వందలు అప్పుతీసుకున్నాడట! ఆ బాకీ ఈ విధంగా సరిపెట్టకుంటున్నాడట! విన్నావా? నీలమణి అన్నయ్య చాలా పేద వాడు కదూ, అందుకని ఈ భువనముఖర్జీగారి దగ్గిరకి వెళ్ళి ముష్టి మూడు వందలకోసం చెయ్యి చాచాడు! ఇంతకీ, వదిన అమాయకు రాలు, ఆమె నెత్తిన చెయిపెట్టటం ఇది! అంతకన్న ఏముంది!" అన్నాడు.

"ఆఁ.చాలాఅమాయకురాలే! 'దాయాది-శత్రుత్వం' అని దీన్నే అంటారు. ఆవిడ చేతిలోనే తోటఉంటే, మనకి అందనిచ్చేది కాదు; అన్నీ ఆవిడే భ్రమింగేది. అంతం తెకొస్తె తక్కువ కొలుకయినా తీసుకుంటే అది మనమే చెల్లించే పనిగా."

"శిస్తు నేనుమాత్రం ఇవ్వనన్నానా? అసలా తోట శిస్తుకిస్తారన్న సంగతి ముందు నాకు తెలియనిస్తేగా! వదినని మంచిమాటలతో మాయపుచ్చి, గప్‌చిప్‌గా రాయించేసు కున్నాడు-" అన్నాడు హరిహరుడు.

సాయంత్రం వేళ చుట్టూ కారుక్రమ్ముకు వచ్చి, హఠాత్తుగా గాలి దుమారం రేగింది. చాలాసేపటి నుంచీ మబ్బులు క్రమ్ముకుని వస్తూ ఉన్నాయి అసలు. అయినా దుమారం హఠాత్తుగా రేగి, తర్వాత గాలితోపాటు వర్షంకూడా ఆరంభమైంది. అపూ వాళ్ళ యింటిముందున్న వెదురు చెట్లు గాలికి అటూ ఇటూ ఒరిగి పోవటంతో వాళ్ల యిల్లంతా ఏమిటో బయలుగా కన్పించసాగింది. ఆకూ అలం, గడ్డి-గాదం, వెదుళ్లాకులు, దుమ్ము ఎక్కడెక్కడినుంచో వచ్చి పడటంతో వాళ్ల మెట్లా అంతా నిండిపోయింది. దుర్గ గాలికి రాలే మామిడికాయలు ఏరుకురావ టానికి వీధి గుమ్మాన పరుగు తీసింది. అపూ అక్క వెనకాలే పరుగెత్తాడు. దుర్గ పరు గెత్తుతూ-"చప్పున పరుగెత్తరా! పోనీ నువ్వి నిద్ర గన్నేరు చెట్టుకింద నుంచో. నేను సువర్ణరేఖ చెట్టుకిందకు పరుగెత్తుతున్నాను-ఊఁ పరుగెత్తు" అన్నది. పెద్దపెద్ద చెట్లకి కూడా కొమ్మలు విరిగిపోయి బోసిగా కన్పి స్తున్నాయి. గాలి హోరుకి చెవులు దిబ్బెళ్లు పడుతున్నాయి. ఎండిపోయిన కొమ్మలు వెదురు బొంగులు పైకి ఎగురుతున్నాయి. నూదుల్లా కొనలు తేలిన ఎండువెదురుటా కులు జుఁయ్‌మని ఆకాశంలోకి ఎగురు తున్నాయి.

సువర్ణరేఖచెట్టుక్రిందికి చేరుకోగానే అపూ ఉత్సాహం పట్టలేక- ఊరికే అటూ యిటూ చిందులు తొక్కుతూ "ఇదిగో అక్కా, ఇక్కడొకటి పడింది...ఇదుగో ఇంకొకటి" అంటూ అరవటం మొదలెట్టాడు. కాని అరిచినంత చురుకుగా మాత్రం కాయలు ఏరలేకపోయాడు. గాలి హోరు మరీ హెచ్చిపోతోంది. ఆ హోరులో మామిడికాయలు క్రింద రాలుతున్న చప్పుడు విన్పించటంలేదు. ఒకవేళ విన్పించినా, అవి యొటువైపు రాలుతున్నాయో స్పష్టంగా అంతుపట్టటం లేదు. దుర్గ ఏడెనిమిది కాయలు ఏరింది. అపూ ఇంతసేపూ హడావిడిగా అటూ ఇటూ పరుగెత్తి-చివ రకు ఏరింది రెండు కాయలే. దానికే వాడు ఎంతో సంతోషంతో వాటిని దుర్గకు చూపిస్తూ-"చూశావా అక్కా, ఎంతెంత ఉన్నాయో ఇవి! ఒకటి ఇక్కడ పడింది, ఇంకొకటి-" అని చెపుతున్నాడు.

ఇంతలో భువన ముఖర్జీ గారింట్లో పిల్ల లంతా బిలబిలలాడుతూ కాయలు ఏరుకో టానికి వస్తున్నట్లు తెలిసిపోయింది."అరే యఁ! దుర్గాదీ, అపూ అప్పుడే వచ్చి కాయలేరుకుంటున్నారు" అని సతూ ఎవరితోనో గ్గరగా అనడం విన్పిం చింది.

ఆజట్టు జట్టంతా సువర్ణరేఖ చెట్టుక్రిందికి చేరుకున్నారు. "మాతోటలోకి ఎందుకు వచ్చారు. కాయలేరుకోటానికి? ఆ రోజున మా అమ్మరావద్దని చెప్పలా? చూడనియ్, ఎన్నికాయలేరుకున్నారో అయినా?" అన్నాడు సతూ.

తర్వాత తనజట్టుకేసి తిరిగి-"సువర్ణరేఖ కాయలు ఎన్నిఏరుకున్నారో చూశావా టునూ?...మా తోటలోంచి వెళ్ళిపో దుర్గాదీ- లేకపోతే మా అమ్మతో చెప్తా ఏమనుకున్నావో!"అన్నాడు సతూ."వాళ్లని ఎందుకు వెళ్ళకొడతావ్ సతూ! "వాళ్ళనీ ఏరుకోనిద్దాం, మనమూ ఏరుకుందాం" అన్నది రాణూ.

"మనం ఏరుకోలేకేం? వాళ్ళిక్కడ ఉంటే కాయలన్నీ వాళ్ళే ఏరుకుపోతారు. వాళ్ల సలు మనతోటలోకి ఎందుకు రావాలి? ఊహూఁ వెళ్ళు దుర్గాదీ! మా తోటలో ఉం డనివ్వం తెలుసా" అన్నాడు సతూ.

మరొకప్పుడయినట్టయితే దుర్గ ఇంతసులు వుగా ఓటమి అంగీకరించేదికాదు. ఆరోజున వీళ్ల తగాదామూలంగానే, తల్లిచేత దెబ్బలు తినాల్సి వచ్చింది. అంచేత మళ్ళీ వీళ్లతో తగాదా పెట్టుకోటానికి ధైర్యంచాలేదు దుర్గకి. కొంచెం చిన్నబుచ్చుకొని, "రారా అపూ! పదపోదాం" అన్నది. మళ్లీ మరుక్ష ణంలోనే లేని ఉత్సాహాన్ని తెచ్చు కుని, "మనం అక్కడికే పోదాంరారా అపూ! ఇక్కడ ఉండనీయకపోతే మానే-అక్కడ ఇంతకంటె పెద్ద పెద్ద మామిడి కాయలుంటాయి. నువ్వూ నేనూ చక్కగా ఏరుకుందాం ఇప్పుడేపోయి రా, పోదాం" అన్నది. ఇక్కడ కొంతసేపు ఉండటం మూలంగా చేజిక్కిన ఫలం జారిపోయింది. అయినా వెళ్ళిపోవలసిరావటం మంచికే వచ్చిందిలే అన్న భావాన్నిమాత్రం అందరి యెదుటా వ్యక్తంచేస్తూ,అత్యుత్సాహంతో అపూను వెంటపెట్టుకుని కంచె చెట్ల సందు లోనుంచి దూరి బయటికి వెళ్లిపోయింది.

"నువ్వు వాళ్లనెందుకు వెళ్లగొట్టావ్?-నువ్వు ఒట్టిచుప్పనాతివి సతూ;" అన్నది

రాబూ. దుర్గ చేలమాళ్ళలు రాబూ మన స్సును బాగా గాయపరిచాయి.

అప్పూ అంత ఆకలి-పు ఉన్నవాడు కాదు. కంచెదాటి, దారిలోకి రాగానే - "ఎక్కడా పెద్ద పెద్దమామిడికాయలున్నది అక్కా! పూంటూవాళ్ల చింతలతోపు దగ్గరనా?" అని అడిగాడు. ఎక్కడో మాత్రం దుర్గ కచ్చితంగా చెప్ప లేదు. కొంచెం ఆలోచించి," పద, ఆ దొరువు గట్టున తోటలోకి పోదాం. అక్కడ అన్నీ చాలా పెద్ద పెద్ద చెట్లున్నాయిలే, పద" అన్నది. ఇక్కడినుంచి ఆ దొరువుదగ్గిరకు వెళ్ళాలంటే ఒక్క అడవిదారిన వెళ్ళాలి. దారిపొడుగునా మాంధాతలకాలంనాటి మామిడిచెట్లు, పనసచెట్లు - ఆ చెట్లకింద ఈమ్మెత్తలు వల్లేళ్లు - అడుగుపెట్టటానికి వీల్లేని అడవిఅంతా. ఊరికి దూరం, పిలిస్తే పలికేందుకైనా ఎవరే మనిషుంట్లా ఉండటమే ఇంతదూరం మామిడికాయలు ఏరుకునేం దుకు సాధారణంగా రెవ్వరూ రారు. ఈ వైపునా ఆ వైపునా ఏ చెట్టు చూసినా పాములాంటి తిప్పతీగెలు పెనవైచుకుని ఉంటాయి. ఈ పెద్ద పెద్ద చెట్లకింద ముళ్ల పొదలమీద రాలిన మామిడికాయలు ఏరు కోవటం అంటే, అంత సులువైనపని కాదు. పైగా కారుమబ్బులు క్రమ్ముకువచ్చి ఆ చెట్ల గుబుర్లక్రింద కన్ను పొడుచుకున్నా కనబడనంత చీకటికోణమైంది. అయినా పట్టువిడవటమంటూ లేని దుర్గ వెతికి వెతికి మొత్తానికి ఓ పది పన్నెండు కాయలు ఏరింది.

"ఒరే అప్పూ! అప్పూ! వాన వచ్చేసిం దిరా!" అన్నది దుర్గ.

అంతలోనే గాలి కొద్ది తగ్గింది. తాటి కాయలంతలేసి చినుకులతో వాన ఆరంభ మైంది.

"ఇటు రా, ఈ చెట్టుక్రింద నుంచుందాం. ఇక్కడైతే వాన పడదు."

చూస్తూ చూస్తూ ఉండగానే పీసుగు తొండాలతో కుమ్మరించినట్లు పడసాగింది వాన. ఆ వానచినుకుల తాకిడికి చెట్ల ఆకులు చినిగి రాలిపోతున్నాయి. ఎండిన, నేల అంతా తడిసి గుబాళిస్తోంది. గాలి ఉధృతం తగ్గినట్లే తగ్గి, మళ్లీ హెచ్చింది. దుర్గ-అప్పూ నుంచున్న చెట్టుక్రింద—దభాటుగా వచ్చి పోయే వానకయితే తడవటమంటూ ఉండదు. కాని తూర్పుగాలి విసురులో చెట్టు ఊగిన లాడిపోతోంది. ఇంటినుంచి చాలాదూరం

# పథేర్ పాంచాలి

వచ్చేశారు వాళ్లు. అపూ భయపడుతూ "అక్కా! వాన పెద్దదవుతోంది, ఎలా?" అని అడిగాడు.

"నువ్వు నాదగ్గరకు రా" అంటూ అపూని దగ్గరకు తీసుకుని, తనవోణీతో వాణ్ణి కప్పి "ఈ వాన ఎంతసేపుంటుంది లేరా, ఇప్పుడే తగ్గిపోతుంది. తగ్గాక మళ్లీ మనం సువర్ణరేఖ చెట్టుదగ్గరికి వెడదాం, యేం?" అన్నది దుర్గ.

ఇద్దరూ వాన ఆగిపోయేందుకు పాటపాడ సాగారు. ఫెళ ఫెళ ఉరుము, మెరుపు రావటంతో అడవి అంతా ఒక్క రెప్పపాటు వెలుతురయిపోయింది. ఎదురుగాఉన్న చెట్టు కొమ్మల చివర అడవి దోసకాయలు గాలికి ఊగిసలాడుతున్నాయి. 'అక్కా' అంటూ అపూ భయంతో దుర్గని కౌగిలించుకున్నాడు.

"ఏం భయంరా? అర్జునా—ఫల్గునా మంత్రం తలచుకో."

వానజల్లు కొట్టటంతో వాళ్ల తల, బట్టలు తడిసి నీళ్లు ఓడుతున్నాయి. ఫెళ ఫెళ ఉరిమి ఆకాశంలో ఒక వైపునుంచి మరొక వైపుకి గీతగీసినట్లు మెరుపు మెరిసింది. "అదేమిటే అక్కా?" అని అడిగాడు అపూ భయపడి.

"ఏం భయంలేదు, ఏం భయంరా? ఇంకొస్త దగ్గరకురా నీతలంతా తడిసి ముద్దయిపోయిందే!"

కుండలతో కుమ్మరిస్తున్నట్టు కురుస్తున్న వర్షధ్వని, మధ్య మధ్య జుయ్ మని గాలి హోరు, చెట్ల కొమ్మలు ఊగిపోతున్న ధ్వని, ఉరుములు, మెరుపులు చెవులు గడియలు పడిపోతున్నాయి. ఈ చెట్లన్నీ విరిగి మీదపడి అణగారిపోతామేమో అనికూడా దుర్గకు మధ్య మధ్య అనిపిస్తోంది.

"అక్కా! ఒక వేళ ఈవాన అసలు వెలవకపోతే?" అని అడిగాడు అపూ.

హఠాత్తుగా చీకటినంతా చీల్చుకుంటూ ఓ మెరుపు వికృత హాసం చేస్తూ ఈమూల నుంచి ఆ మూలకి రయ్యిన పరుగుతీసింది... భీభత్సంగా ఉన్న ఈ ప్రకృతి ఒడిలో చిక్కుకున్న ఆ నిస్సహాయ బాలబాలికలకళ్లు మిరుమిట్లు గొల్పాయి.

అపూ భయంతో కళ్లు మూసుకున్నాడు.

దుర్గ భయంతో పైకిచూసి, "పిడుగుపడుతుందా?" అనుకుంది— చెట్ల చివరను 'ధుంధుల్' పళ్ళు వ్రేలాడుతున్నాయి.

మళ్లీ ఈకొసనుంచి ఆకొసవరకు తళుక్కున మెరిసింది. దుర్గ అపూని ఇంకా దగ్గరగా లాక్కుని—'అర్జునా, ఫల్గునా,' అంటూ × బ × బా అనుకోసాగింది. భయంతో దుర్గ గొంతు వణకిపోతోంది...



—(ఇంకా వుంది)

అడయ్యార్, థియొసాఫికల్ సొసైటీలోని సుందర శిల్పం.

—ఫొటో: వనల కృష్ణకుమార్, మద్రాసు.

శ్రవ్య నాటిక:

# మహాశ్వేత

(దూరంగా వీణానిస్వనం వినిపిస్తుంది. మహాశ్వేత-దూరంగా-వీణతో పాట)

శివ, మహాదేవ, తే ప్రణమామి
శంకర, కల్మషహార, ప్రణమామి.

(ఆగి)

అమృతకుంభము నీ దయాంతరంగమ్ము
అరమరిక లేక నిన్నర్థించినాను
ఆదరింపవో, ప్రియుని యందు జేరు
పవో...

(ఆగి)

శివ, మహాదేవ, తే ప్రణమామి
శంకర, కల్మషహార, ప్రణమామి ...

(సంకీర్తిస్తుంది)

చంద్రాపీడుడు: (గుఱ్ఱపు డెక్కల చప్పుడు, ఆగి) కిన్నెరలెల్లా వుంటారో చూదామని వెఱ్ఱినై పరుగెత్తాను. ఎంత తెలివి తక్కువ. వేటా సాగలేదు. శిబిరానికికూడా దూరమైపోయాను. ఇక్కడెక్కడైనా మంచి నీరముందేమో. (గుఱ్ఱం నడుస్తుంది) ఆహాఁ, యిదుగో యెంత మనోహరమైన సరోవరము ఎంత స్వచ్ఛమైన ఉదకము. దీనికి "అచ్ఛోద" మనే పేరు యెంతైనా తగుతుంది. (మంచినీళ్లు తాగి) కొంచెం యీ చెట్టు నీడని విశ్రమిస్తే ఈలోగా ఇంద్రాయుధంగూడా అలసట దీరి, పచ్చిక మేస్తుంది.

(వీణానిస్వనం వినిపిస్తుంది)

ఈ కారడవిలో వీణానిస్వనం యెక్కడిది చెప్మా! అదుగో యింద్రాయుధం చెవులు రిక్కించుకు నుంచుంది. నాకంటె ముందుగా నే విన్నది గాబోలు! ఆఁ...ఉత్తరపు ఒడ్డునుంచి వినిపిస్తోంది. వెళ్ళి చూస్తే?

(వీణానిస్వనం దగ్గరవుతుంది)

ఈ యోగిని యెవరో భగవత్ప్రార్థన జరుపుతుంటోంది. ఈమె ప్రార్థనకు భంగం జరుగకుండా, నిశ్శబ్దంగా నిల్చుంటాను.

(మహాశ్వేత ప్రార్థనముగిస్తూ మెల్లగా అటుంది.)

మహా: ఎవరో, అతిథులో - ఆత్మబంధువులో అభివాదనం. దయచేయండి. ఈ నారబట్టకంటె మీ కాసనమీయ లేని పేదరాలిని. ఈ తీయమామిడి పండ్లు భుజిస్తారా..

చంద్రా: మీ ఆదరణకు కృతజ్ఞుడను. వేటకి వచ్చి దారి తప్పిపోయాను. "అచ్ఛోదం"లో మంచి నీరు త్రాగుతూవుండగా వీణ మీటినట్లనిపిస్తే, ఏమో చూదామని వచ్చాను.

మహా: ఒక మహనీయుడి కాతిథ్యమిచ్చే భాగ్యం నాకు కలిగింది. సేదదీరి వెడుదురుగాని.

చంద్రా: అమ్మా, కేవలం కుతూహలం చొప్పున అడుగుతున్నాను. మీరు అన్యథా భావించవద్దు. ఇంత లేతవయస్సులో, రాజప్రాసాదాల్లో వుండవలసిన మీరు యీ నిర్జనారణ్యంలో తపస్విగా వుండటానికి కారణం నేను వూహించలేకపోతున్నాను. మీరు మరోలా తలచకపోతే వినాలనివుంది.

మహా: నా కథ వింటారా, నా దీనగాథ విని మీరు కూడా యెందుకు ఖేదం అనుభవించాలి. ఈ నా నిరంతర దుఃఖం నాలో వుంటే చాలు...(కంఠం రుద్ధమౌతుంది.)

చంద్రా: క్షమించు తల్లీ, నీకు బాధ కలిగించే విషయాల్ని జ్ఞప్తికి తెచ్చిన క్రూరుణ్ణి మన్నించు.

మహా: ఇందులో మీరు చేసిందేమీలేదు రాజకుమారా! నా దురదృష్టఫలమే నా దుఃఖం. అంతశ్శోకం ఆప్తులతో చెప్పుకోవడం కూడా ఒక ఆనందమే. (ఆగి) అప్సరసలనిగూర్చి మీరు వినేవుంటారు. బ్రహ్మ మనస్సులోనుంచి పధ్నాలుగు అప్సరఃకులాలు జన్మించాయి. వాటిలో దక్షప్రజాపతి సంతతివారం మేము. దక్షునికి ముని, అనిష్ట అని యిద్దరు కూతుళ్లు. అందులో అరిష్ట అనే ఆమెకి మా నాయన పెద్దకొడుకు. మా నాయనగారైన హంసుడు చంద్రుని సంతతికి చెందిన గౌరి అనే, నా తల్లిని వివాహమాడి హేమకూటం అనే గంధర్వ నగరంలో రాజ్యం పాలిస్తూ వుండేవాడు. వారిరువురికీ నేను జన్మించాను. మహాశ్వేత అని నాకు పేరుపెట్టారు. అంత తెల్లగా వుండేదాన్ని.

చంద్రా: మీ నాయనగారు హంసుడు తెల్లనివాడే. మీ తల్లిగారు గౌరి. ఆమె కూడా తెల్లనిదే. మీ తల్లిగారు చంద్రుని సంతతిగదా, చంద్రుడూ తెల్లనివాడే. మీరు మహాశ్వేత కావడంలో ఆశ్చర్యం ఏముంది?

మహా: వసంతానికి మధుమాసంలాగా, మధుమాసానికి కొత్త చిగుళ్లలాగా నాకు యౌవనం సంప్రాప్తమయింది. ఒకనాడు...

చంద్రా: ఒకనాడు...?

మహా: నేనూ, నా తల్లీ నా సఖులూ యిక్కడ ఈ అచ్ఛోదసరోవరంలో స్నానం చేయడానికి వచ్చాం......

*　　　*　　　*

మహా:

తరలికా, ఓ తరలికా
చూడవే పూవులు!
తరువు తరువుకొక తీవతీవగా
తీవ తీవకొక వేయి పూలుగా
పూవులు పూవులు చూడవే...
తరలికా ఓ తరలికా చూడవే పూవులు
పూవులు నీ నవ్వులవలె
పూవులు నా కోర్కెలవలె
పూవులు యీ వనరాణికి
పులకలై పులకలై చూడవే..
తరలికా ఓ తరలికా పూవులుచూడవే....
అంతదాక అల్లంతదాక యీ
పూవులు సంద్రపు లేత నురగలై
పున్నమ వెన్నెల పాలగిన్నెలై
విరిసినవే! రావే! ॥తరలికా॥
కోయవే ఒక కోటి పూలు
కోయవే నీ యొడి నిండుగ
కోయవే నా హృది నిండగ
కోయవే రావే ॥తరలికా॥

తరలిక: మహాశ్వేతా, మహారాణి అచ్ఛోదసరస్తీరాన కనిపెట్టుకుని వుంది. మనం వేగం వెళ్లద్దూ?

మహా: ఈ పూవులు మాడు, ఒక టోకటిగా కోసుకుంటూ పోదాం. రా. (ఏదో సంతోషంగా సన్నగా రాగం, ఆలపించుకుంటూ వుంటుంది. రాగం మందంగా ఆగుతుంది.)

మహా: తరలికా యీ సువాసన ఏమిటే!

సూరంపూడి భాస్కరరావు

#  మహాశ్వేత 

ఏదీ తరలిక.? ఎంతదూరం వచ్చేశానో కాని, యీ అలౌకికసౌరభం యేపూవుదైయుంటుంది! ఈ పూవుకాదే. ఈ పూవుకాదూ-ఆ మూలనుంచి వస్తూంది. అబ్బ ఎంతగా హృదయాన్ని కమ్మేసుంటోందో? పుష్ప పరిమళంకూడా మనస్సును సమ్మోహితం చేసేస్తోంకే. అదుగో – యెవరో మునికుమారుడు కాబోలు. ఎంత తేజస్వంతమైన ముఖం. ఆ మన్మధాకారుడు జపమాల ధరిస్తే-ఏమిటి, యేదో చెప్పరాని అనుభూతి కలుగుతోంది. అదుగో ఆయనకూడా నన్ను చూచారు. ధన్యురాలను. ఆ కండ్లలోకూడా ప్రణయం ప్రస్ఫురించింది. ఆ దేహం పులకరించింది. అయ్యో, ఆయన తపస్విఅయినా నాహృదయాన్ని నేను మరల్చుకోలేకుండా వున్నాను. అదుగో యిటే వస్తున్నారు. నమస్కరిస్తాను (కొంచెం బిగ్గరగా) మహా మునికుమారునకు పాదాభివందనం.

పుండరీకుడు : ఎవరు ? నేను మునికుమారుణ్ణా ? పాదాభివందనమా ? ఔను. తేజస్సంపన్నుడైన వరుణ్ణి వివాహమాడి సుఖించు.

మహా : తమ ఆశీర్వాదబలం.

పుండ : ఏ మహారాజకన్యవో, యింత సౌందర్యాన్ని యెల్లా సంతరించుకొన్నావు ?

మహా: క్షమించండి.వస్తాను. తరలికా...

పుండ : పాపం సిగ్గుపడిపోయింది. ఇంతవరకు తపఃప్రభావాన్నీ, కపింజలుడి స్నేహాన్నీ యెరుగుదునేకాని, లావణ్యమనేది యింత ఒడలు మరపించగలదని యెరుగను. ఆహా...ఆమె యెందుకలా నా మనస్సులో వుండిపోయింది. ఆమె వెళ్ళిపోయిన తరవాతకూడా నా కళ్లు ఆమెనే చూస్తున్నాయేం ?

చెలిమి తీరులు తెలియరానివి,
వలపులో మృగజలములో ;
అల్లలాడే వేవో యేనవ
వల్లితలలో పూవులో !
కల్లమరచిన కన్నె హృదిలో
పల్లవించిన తీవలో !
మెరసిపోయే వేవో యేజల
ధరవిలీన చలార్చులో !
విరియనోపని మొగ్గకన్నుల
కరగుసిగ్గరి నగవులో ! ఛీ!
అలము చీకటులేవో యేకే
లలనపరచిన చెరగులో!
కలత పలుకుల వలలలోయే
కలలరాహాస్యమ్ములో!

కపింజలుడు: పుండరీకా, నీకిది తగునా? ఒక స్త్రీని చూచి అంత తత్తర పడుతావని నేననుకోలేదు. నేను దూరమునుంచి చూస్తూ నేవున్నాను. ఆమె నీకు నమస్కరించినప్పుడు నీవు వణికిపోయావు. నీ వు జపమాల జారవిడిచావు. నమస్కరిస్తున్న ఆ కన్నె, ఆ జపమాల భూమిమీద పడకముందే తానందుకుంది. పైగా వెళ్ళిపోతూ నీ జపమాలకు బదులు తన కంఠహారాన్ని ఇచ్చింది. నువ్విదేదీ గమనించలేదు. నీ జపమాలని దొంగిలించిన ఆ చిన్నది, నీ హృదయాన్ని కూడా దొంగిలించిందన్నావంటే సిగ్గుచేటు. ఆ పిల్ల, నిన్నుగూర్చి నన్నంతా అడిగింది. నీకీ సాంగత్యం తగదు. నీ తపోనిష్ఠ భగ్నమౌతుంది. ఆ పిల్లను తలుచుకోకు. రా పోదాం.

పుండ: ఆగు కపింజలా, ఆ పిల్లమీదనించి మనస్సు మరల్చుకోలేకపోతున్నాను.

కపిం: చూసు. యిప్పటికైంది చాలు. నీలాంటి మహనీయుడు ధర్మనిష్ఠలోనించి పరిచ్యుతుడు కారాదు. పైగా ఆమె నీతో మాట్లాడుతూండగా, నీవామె చెవిలో, ఆ దేవతా కుసుమాన్ని వుంచావా.? నందనవన దేవత ప్రీతితో నీ కిచ్చిన పూవుని ఒక అపరిచితురాలికి యిచ్చేస్తావా! ఇంత దౌర్బల్యం పనికిరాదు. పరిహాసంగా వుంటుంది.

పుండ: నేను చెప్పలేను కపింజలా, నేను నిగ్రహించుకోకలిగిన అనుభూతి కాదు. ఆమె స్నేహం, సాంగత్యం నాకు కావాలి.

కపింజల: పుండరీకా— శ్వేతకేతుడంత తపశ్శాలికి లక్ష్మియందు జన్మించిన దివ్యపురుషుడవు. అంత తేజశ్శాలివి. నీవు కూడా స్త్రీకే వశుడవై పోయావా.?



"ఆరోగ్యంగా ఉన్నారా? అని ఒక విలేఖరి ఒకసారి చర్చిల్‌ను పరామర్శించాడు."

"ఆ; ఆరోగ్యంగానే ఉన్నాను. ఉండకేం చేస్తాను. ఈడెన్ పెద్దవాడై పోతున్నాడు మరి," అని చర్చిల్ సమాధానం ఇచ్చాడట.

పుండ: ఆమె వెళ్ళిపోయిందికదూ? కపింజలా నీ వొక్కడవే నాకు ఆత్మబంధుడవు. నువ్వు నా ప్రాణమిత్రుడవు. నీతోకాక యితరులతో చెప్పుకోలేను. అదుగో ఆమె చెలికత్తె వస్తోంది. కొంచెం తెలుసుకొంటాను...ఆమెను గూర్చి. నువ్వు వొకసారి అటుండు. తరలికా...తరలికా...

తరలిక: యెవరు? మునికుమారులా...నమస్కారము. తమకు నా పేరెలా తెలుసు? దూరదృష్టి కాబోలు.

పుండ: కాదు, మీ చెలి నిన్ను కేకేస్తుంటే విన్నాను.

తరలిక: అయితే మా చెలిని యింతకుముందే యెరుగుదురన్నమాట.

పుండ: యెరగను.

తరలిక: మరైతే, మా చెలిమాట యెలా చెప్పారు?

పుండ: చూశాను.

తరలిక: వుహూ.

పుండ: తరలికా, నేను మునికుమారుడనే కాని, మీ చెలిని చూచి చలించిపోయాను. ఆ లావణ్యవతి యెవరో తెలియజెప్పవూ...

తరలిక: అయ్యో తమరు మునికుమారులు, అలా చలించడం భావ్యమా...?

పుండ: భావ్యమో – కాదో, మీ చెలి యెవరు? ఆమె పేరు?

తరలిక: మీరు కోరితే నేను చెప్పక తప్పదు. ఆమె పేరు మహాశ్వేత. గంధర్వ రాజు హంసుని కుమార్తె. హేమకూట నగర వాసిని. శలవు. (నిష్క్రమణ)

పుండ: గంధర్వకన్య. మహాశ్వేత! హంసుని కొమార్తె! హేమకూటవాసిని. త్రిలోకసుందరి. అతిలోక లావణ్యవతి!

కపింజల: పుండరీకా, ఏమిటి పిచ్చి? నగుబాటు సుమా...

పుండ: కపింజలా, హేమకూటవాసిని, హంసుని కుమార్తె. మహాశ్వేత వెళ్ళిపోతోంది. నా స్థితి ఆమెకి తెలియపరిచిరా. నీవు కూడా హేమకూటం వెళ్లు. ఏదో కార్చిచ్చు నన్ను కాల్చివేస్తోందోయి.

కపిం: పుండరీకా, నా ప్రాణంతో సమానం...నువ్వు. నువ్వే యింత దీనుడవై పోతా వనుకోలేదు.

పుండ :—

ఇది యేదో గ్రీష్మము కపింజలా!
ఇవి యేవో జ్వాలలు కపింజలా!
ఇనబింబమె అనలము జిమ్మెనో?
కనుపింపని నిప్పులు రాల్చెనో?
మనసే హోమాగ్నికి సమిధగ,
తనువే యీ వహ్నికి కట్టెగ
ఇది యేదో గ్రీష్మము కపింజలా!
ఇవి యేవి జ్వాలలు కపింజలా!
ఏ మేఘము వర్షించునో నీరము?
ఏ నాటికి శాంతిల్లునో తాపము?
ఏమో మరి రాగేమో మహాశ్వేత
ఏమో మరి రాదేమో మహాశ్వేత.
ఏమో......

*  *  *

(హేమకూట నగరంలో రాజ ప్రాసాదంలో మహాశ్వేత తరలికతో ముచ్చటిస్తూ వుంటుంది.)

తరలిక : ఏమమ్మా, రాజపుత్రి పలుకే బంగారమైపోయిందే...

మహా : బంగారం కాదే, ఆ మునికుమారుడు దేవాంశసంభూతుడేమో. ఎంత తేజస్వంతుడే. మరచిపోలేకుండా వున్నాను అతడెవరో తెలియనే తెలియదుకదా.

తరలిక : అతడెవరైతే నీ కెందుకమ్మ మునికుమారుడు నీ కోసం తపస్సు ధారపోసుకుంటాడా యేమిటి?

మహా : అట్లా అనకే. అతనిలో ఏ వలపు లేకుండానే, ఊరికే కలిగిందంటావా యీ ఆటం. అతడు తన రుద్రాక్షమాల జారవిడుచుకున్నాడే నేను నమస్కరిస్తున్నప్పుడు. ఇదిగో అది. దానికి బదులుగా నా కంఠహారాన్నిచ్చాను. అతడు చూసుకొనైనా చూసుకోలేదు. ఆ మహాభాగుడెవరో తెలియదుగదా...

తరలిక : నేను చెప్పనా ఎవరో...?

మహా : నీకు తెలుసుగా?

తరలిక : తెలుసును.

మహా : ఆఁ...అన్నీ అబద్ధాలు, నీకెట్లా తెలుసును?

తరలిక : పోనీ నాకు తెలియదుగాని, పాపం ఆయన, మునికుమారుడుగదా, తపోనిష్ఠలో ఉండేవాడుగదా, ఆయన మనస్సుని యీ విధంగా హరించేస్తే ఆయన యేమైపోవాలి చెప్పు.

మహా: ఓహో, దెప్పిపొడుస్తున్నావు మహాను. నామనస్సుని ఆయన హరించేశాడుగదా, నే నేమైపోవాలి చెప్పు.

తరలిక: ఏమో బాబు. నా కెందుకు, నేను మహారాణిగారి దగ్గరికెళ్లి రావాలి.



# మహాశ్వేత



మహా: ఉండవే, ఉండవే. నీకేనో తెలుసునన్నావు చెప్పవూ...?

తరలిక: ఏమోనమ్మా, నిన్నూ—నీ ప్రియుణ్ణిగూర్చి నాకేం తెలుసు?

మహా: అబ్బ. చెప్పదూ...

తరలిక: అల్లా బ్రతిమాలుకో చెప్తాను.

మహా: నీ పెద్దరికి వెయ్యి దణ్ణాలు గాని చెప్పవే.

తరలిక: కాని, నాకు చాలా విచారంగా వుంది. 'బ్రహ్మ చేతలన్నీ పాడైన చేతలు' అన్నారందుకే.

మహా: అదేమీ?

తరలిక: కాకపోతే, పాపం చూడు. అతనంత తపస్సంపన్నుడా? దివ్య పురుషుడా? అయితేయేం? ఇట్టే కరిగిపోయాడు. నీమీద వలపు కలగగానే హృదయం కటికప్పన జారవిడుచుకున్నాడు. అతడంత సుకుమార హృదయుడైనందుకు, నువ్వు యెలాటి దానివి? కటి పాషాణంగదా నీ హృదయం. ఏకోశానా జాలిలేదు. అతడెంత తపించిపోతున్నాడో. నువ్వు మాత్రం కులాసాగా మీ రాజభవనంలో ఆనందిస్తున్నావు. 'బ్రహ్మ చేతలు పాడు చేతలు' కాకపోతే యేమిటి?

మహా: అబ్బ, అలా అనకే. నాకు— యేమిటో యేమీ తోచడం లేదు. మళ్ళీ యెలాగే ఆయనని చూడడం? ఇంతకీ ఆయన యెవరే?...

తరలిక: ఎవరైతే యేం, పాపం నన్ను పిలిచి, నిన్ను గురించి అంతా అడిగి నాపోయాడు. లక్ష్మీదేవి శ్వేతకేతు మహర్షిని చూచి సద్యోగర్భం పొందగా జన్మించాడు. ఆయన తనదగ్గరున్న దివ్యపుష్పాన్ని నీపరం చేశాడుకదా. నువ్వేమైనా కృతజ్ఞత చూపావా...?

మహా: తప్పేనే. అపచారమే చేశాను. పాడు సిగ్గు నన్నుక్రమ్మించి తిరుమగ్గోట్టేసింది. పైగా అమ్మ చూస్తుందేమోనని భయం.

చేటి: రాజకుమారికి నమస్కారం. ద్వారం దగ్గర ఒక బ్రహ్మచారి మీ దర్శనం అత్యవసరమని తొందర చేస్తున్నాడు.

మహా: ప్రవేశ పెట్టు.

తరలిక: నీ ప్రియుడి ప్రాణస్నేహితుడమ్మా. ఏదో సందేశం తెచ్చాడు.

మహా: మునికుమారులకు నమస్కారం.

కపిం: కళ్యాణమస్తు. రాజపుత్రీ నా మిత్రుడు పుండరీకుడు నిన్ను అచ్ఛోదసరః ప్రాంతంలో చూచాడు. నువ్వు కూడా అతణ్ణి చూచావు. అంత నిశ్చల మనస్కుడు, నిన్ను చూచి చలించిపోయాడు. నిన్ను చూడగానే, పాముకాటు తిన్నట్టుగా, విషగ్రస్తుడిలా దుస్సహబాధననుభవిస్తున్నాడు. ఇప్పుడు నీవు రాకపోతే నా మిత్రుడి ప్రాణాన్ని నేను నిలుపుకోలేనేమో. దయజూచి అతణ్ణి కాపాడవూ...

మహా: మహాపురుషా, అల్పురాలిని. నా ప్రాణంలోని ప్రతి స్పందనం ఆయన సామీప్యాన్ని కోరుతున్నది. గంధర్వకన్యనై కూడా రెక్కలు కట్టుకుని ఈ నిముషాన ఆయన దగ్గర వ్రాలలేకపోయిన నా నిశ్శక్తతని సహించలేను. ఈ క్షణంలో నేను బయలుదేరి వస్తున్నాను. మీరు నడవండి.

కపిం: తప్పక రావాలి రాజపుత్రీ...

మహా: తప్పక వస్తాను మునికుమారా.... తరలికా ఉద్యాన ద్వారం తెరిపించు. దౌవారికుని అమ్మతో చెప్పమని చెప్పు. బయల్దేరు.

*    *    *

తరలిక: అంత తొందరెందుకమ్మా, చూడు నీ పాదాలు రక్తంచిమ్ముతున్నాయి. నీ చెంగుముళ్లు రాసుకుని పేలికలైపోతోంది.

మహా: త్వరగారా తరలికా. త్వరగారా తరలికా. ఏవో జ్ఞాపకం ఆయన తలుపుకి వస్తే గుండె తల్లడిల్లుతోంది సుమా-నా బాధ నేను సహించగలను-కాని-ఆయనకి-ఆ పుండరీకునికి, తెల్ల తామరవంటి సుకుమారుడు-ఆ హృదయంలో యే దావానలం చెలరేగిందో, ఆయన యెంత వాడిపోతున్నాడో-తరలికా.

*    *    *    *

కపింజల: పుండరీకా, పలకవూ...మహాశ్వేతకి చెప్పి వచ్చాను. ఇదుగో ఈ క్షణంలో వస్తుంది. ఇంత చందనం అలమినా నీ దేహమింకా కాగిపోతూనే వుంది. ఈ తామరరేకులతో కూర్చిన శయ్య వెచ్చనైపోతూంది. ఇదిగో ఈ మంచినీరు త్రాగు. లే కొంచెం సేదదీరు-అయ్యో ఈ చెమట లేమిటి? మహాశ్వేత వొస్తూందిలే...పుండరీకా.

(చంద్రుడిలోనుంచి ఒక కాంతిమయ పురుషుడు అవతరిస్తాడు.)

ఎవరా దివ్య పురుషుడు, చంద్రబింబంలోనుంచి వెలువడి పుండరీకునివైపు వస్తున్నాడు. అదుగో పుండరీకుణ్ణి స్పృశిస్తున్నాడు. అతనికి స్మృతికలిగేందుకు శైత్యోపచారం జరుపుతాడు కాబోలు. నే కొంచెం ఒత్తిగిలుతాను.

మహా: (దూరంగా) రా తరలికా, అబ్బా యెంత నడిచినా ఈ దూరం తరగదు కాబోలు.

కపింజల: అదేమిటి. ఆ దివ్య పురుషుడు పుండరీకుణ్ణి లేవనెత్తుతున్నాడెందుకు? ఆఁ...పైకెగురుతున్నాడు పుండరీకుణ్ణి! తీసుకుపోతున్నాడు. నా స్నేహితుణ్ణి అపహరించుకుపోయే దొంగవి-యెవరు నువ్వు, పెగా చంద్రలోకంలోనుంచి వచ్చావా? ఇదుగో నిన్ను విడవను. ఆకాశంలోకైనా, చంద్రమండలానికైనా నిన్ను వెన్నాడుతాను. నా స్నేహితుణ్ణి నీ చేతుల్లో వదిలేసి చూస్తూ ఊరుకుంటాననుకున్నావా? (కంఠం దూరమౌతుంది.)

తరలిక: రాకుమారీ, అదేమమ్మా. ఆ దివ్య పురుషుడెవరో గాని. పుండరీకుణ్ణి తీసుకుపోతున్నాడు. కపింజలుడేమో కేకలు వేస్తూ ఆయనని వెన్నాడుతున్నాడు.

మహా: ఎవరు స్వామీ నువ్వు. నా ప్రాణాలని తీసుకువెళ్ళవేం? నీకు న్యాయమేనా యీ యడబాటు కలిగించటం. నా ప్రియుణ్ణి నాకియ్యవూ? ఇయ్యవూ. అబ్బా యీ దేహం బరువుగా వుంది. దీన్ని వదిలేస్తే, నేనుకూడా నా ప్రియుడిదగ్గరికి వెళ్ళిపోవచ్చు. నా ప్రియుడు లేకపోతే నా కెందుకీ దేహం? ఆగు మహాపురుషా నేనూ వస్తా. (మూర్ఛిల్లుతుంది).

తరలిక: అయ్యో, మహాశ్వేతా, ఆ మహాపురుషుడేదో పలుకుతున్నాడు. వినిపించుకోవూ...?

మహా: తరలికా, చితి పేర్చు. ఈ దేహాన్ని విడిచిపెట్టేస్తాను. పుండరీకుణ్ణనుసరించి వెళ్లిపోతాను. నా ప్రేయుడిదగ్గరికి వెళ్లిపోతాను. చితి పేర్చు.

దివ్యపురుషుడు: మహాశ్వేతా, వద్దు. నిరాశపడకు. నీ ప్రియుడు నీకు తిరిగి లభిస్తాడు. నీ ప్రియుడు నీకు తిరిగి లభిస్తాడు.

మహా: లభిస్తాడా - యేనాటికైనా నిజంగా నా ప్రియుడు నాకు లభిస్తాడా? ఆ మహాపురుషుడేమన్నాడు తరలికా...?

తరలిక: నీ ప్రియుడు నీకు లభిస్తాడటమ్మా. విచారపడవద్దన్నాడు

మహా: నిజమేకాదూ? ఆ దూరాన చూడు చండీశ్వరాలయం. ఆ పరమేశ్వరుణ్ణి భజించుకుంటూ యిక్కడే వుండిపోదాం ఇక్కడే నా ప్రియుడికోసం యెదురుచూస్తూ గడుపుతాను రా...

"శివ, మహాదేవ, తే ప్రణమామి,
శంకర, కల్మషహార, ప్రణమామి"

*    *    *

బృందగీతి:
ప్రేమ తెల్లనిదోయి ప్రేమ తెల్లనిదీ!
బ్రతుకు విడి బ్రతుకునకు పయనమైనా
గాని
ప్రేమ ఆరనిదోయి ప్రేమ ఆరనిదీ!



(బాణుని "కాదంబరి" ఆధారంగా)
ఆలిండియా రేడియో ప్రసారితం.

# ద్వికళత్ర యోగం

ఓ అందమా, ఓ చందమా? పిల్ల ఏం బావుందని? రత్నంలాంటి యీ ఒక్క మనమడికి చూసి చూసి ఆ పిల్లను కట్టబెట్టడానికి ఎల్లా ఒప్పుకుంటాను, పిల్ల యెత్తునా ధనం తూచి కట్నం యిస్తారుట, ఎందుకివ్వరూ? ఇంతకీ ఆ పిల్లను చేసికోవలసినంత పరిస్థితి మనకేం పట్టింది? నా పెళ్ళినాటికున్న నూటిరవై యెకరాలల్లా నూటయెనభై యెకరాలవరకూ పెరిగిందాయె. తరతరాలకీ ముప్పయ్యేసి యెకరాలు అసలాస్తిలో కలవనే కలుస్తోందికదా! నాలుగు పురుషాలనుంచీ వరుసలా ఒక్కొక్కడే మగపిల్లాడు. అసలీ వయస్సులో పెళ్ళిచేయ తలచామని తెలుస్తే చాలు కోటికి పడగలెత్తిన శ్రీమంతులు బొమ్మల్లాంటి కన్యల్ని కాళ్ళముందుంచి, అడిగిన కట్నం ఇయ్యకపోతారా? ఏమయినా ఆస్తులిల్లా పోగుపడుతూండడం, ఏకపుత్ర సంతతీ యీ వంశానికాచారమయిపోయింది. ఇంక గాడితప్పి నడిచేలా లేదీ సంసార శకటం' అని సణుక్కుంటూ 'ఇంక మొగమాటం యెందుకు, వాణ్ణే పిలిచి అడిగేస్తా నాలుగు మాటలూను. నా బొందెలో ప్రాపిరుండగా జరగనిస్తానా యీ సంబంధం?' అని నిశ్చయించుకొని 'ఒరేయి అబ్బాయీ!' అని కేక వేసింది తులసమ్మదగ్గర యెండపడిని కూర్చున్న ముసలి వితంతువు.

కళ్ళజోడు పెట్టెలో పెట్టి టక్కున నొక్కుతూ తల్లివద్దకు వచ్చి నిలబడ్డాడు లక్ష్మీపతి. 'ఆ నాడు ఆర్యాపురంలోని ఆంజనేయులుగారూ, కొడుకూ పెళ్ళి చూసుకొని తప్పరించిన సంబంధమేనా యిది?' అంది తల్లి. 'ఒక్క ఆర్యాపురమేమిటి, ఆర్యావర్తం అంతా తిరుగుతున్నారు సంబంధంకోసం, చివరికి ఏమూలనో ఉన్న వలసాంధ్రుల్ని కూడా కంకుకదిపి చూచారు పెద్ద నోట్లకట్టలు కుమ్మరిస్తూ. ఏమయితేనేం ఒక్కడూ కుమ్మంయొక్క తొంగిఅయినా చూడ్డంలేదు. రొమ్ముమీద కుంపటిలా ఉన్న యీ పిల్లకు సగం ఆస్తైనా కట్టబెట్టి విడిపించుకుందామని చూస్తున్నాడా కన్యాదాత' అన్నాడు లక్ష్మీపతి.

'అయితే నిన్ను శరణుజొచ్చాడా యేమిటూ పెద్దమనిషి.'

'శరణు కాదు, కరుణ' అన్నాడు కొడుకు.

'ఎవర్ని చూసి, పిల్లని చూశా, పిల్ల తండ్రిని చూశా యీ కరుణ' అంది తల్లి.

'ఇద్దర్నీ చూసి కాదు, మన చిట్టిబాబుని చూసి' అన్నాడు లక్ష్మీపతి.

'ఏమిటిరా నీవనేది? చిట్టిబాబుని చూశా?' అని ముఖం పైకెత్తి కొడుక్కేసి చూచింది.

లక్ష్మీపతి ముఖం వెలవెలబోయింది. 'చిట్టిబాబు కేమిరా? పున్నమి చంద్రుడివంటి బిడ్డనిగూర్చి అల్లా దిగులుగా మాట్లాడుతున్నావేంరా? ఏమయినా, బొందిలో ప్రాపిరుండగా యీ సంబంధం జరగనీయను, జరగనీయను తెలిసిందా' అంది ధీమాగా తల్లి.

'రోజూ తులసమ్మ దగ్గర కూర్చుని నీవు చేసే జపం యిదేనా ఏమిటమ్మా" అన్నాడు కొడుకు.

తల్లి : నీవు ఇనపపెట్టెవద్ద కూచుని చేసే జపంకంటె ఘనమయిన జపమే చేస్తున్నానురా నాయనా! తరానికి తరానికీ మన్య ఆస్తి కుప్పల్లా పేరుకుపోడం, నాలుగు పురుషాలనుంచీ వరుసలా ఒక్కొక్క పిల్లడే పుడుతూండడం అనే ఈ వంశాచారాల్ని తప్పించమని ప్రార్థిస్తున్నాను.

"అయితే ఒక్క సంగతడుగుతున్నాను. నిదానించి సమాధానం చెప్పమ్మా" అని తల్లికి దగ్గరగా చతికిలబడ్డాడు లక్ష్మీపతి.

కళ్లు పెద్దవిచేస్తూ "అల్లా అడుగు కావలసిందేదో" అంది ఆమె.

"నాలుగు తరాల్నుంచి ఒక్కడే మగపిల్లాడు పుడుతున్నాడా మన వంశంలో" అన్నాడు కొడుకు.

"కాదుట్రా మరి" అంది ధీమాగా తల్లి.

"మన వంశంలో ఇదొక్కటే ఆచారమా ఇంకేమన్నా విడ్డూరాలుజరుగుతున్నాయా" అన్నాడు లక్ష్మీపతి.

"అడిగతలచిందేదో సూటిగా అడుగు" అంది తల్లి.

కొడుకు : నాలుగు తరాలనుంచి ఏకపుత్ర సంతతేనా నీవు కళ్ళారా చూచేది?

తల్లి : మానసం ఏమిట్రా అనుభవిస్తున్నాం కాదూ?

కొడుకు : ఆఁ! అదే! అనుభవిస్తున్నాం. సరేకాని నీ వెరుగున్నంతలో యెంతమందికి రెండో వివాహం జరిగిందంటావు మన వంశంలో?

తల్లి : ఎంతమందికేం, మామగారికి, మీ తండ్రికి, నీకూ అందరికీ జరిగాయి.

కొడుకు : అల్లాగా? ఆస్తుల్నీ, పుత్రుల్నీ గూర్చి ఆలోచిస్తున్నావు గాని ఇంతమందికీ ఈ వంశంలో యీ ద్వికళత్ర యోగాన్ని గూర్చి ఎప్పుడైనా ఆలోచించావా?

తల్లి : ఆలోచించేందు కేముంది? కర్మ, ఎవరు తప్పిస్తారు?

కొడుకు : అయితే యీ యోగం మన చిట్టిబాబుకి కూడా పడుతుందేమో?

తల్లి : శుభమా అని పెళ్ళిమాటలు మాటలాడుతోంటే తీరికగా కూచుని ఇల్లాటి మాటలు పలుకుతున్నావేమిరా?

కొడుకు : పెళ్లి ప్రస్తావన వచ్చింది కాబట్టే వంశాచారాన్ని గూర్చి కూడా ఆలోచించవలసి వస్తోంది. తరతరాల్నుంచి వచ్చే ఆస్తులమీదా, పుత్ర సంతతిమీదా ఉన్న నమ్మకం ఈ ద్వికళత్ర యోగంమీద ఎందుకు నీకు లేదూ అని అడుగుతున్నా.

కొడుకు చెప్పిన మాటలు వినేసరికి ఆమెకి కొంచెం ధైర్యం సడలిపోయింది. సవతి పోయిన పదమూడో నాడు జరిగిన తన వివాహం మసకగా కళ్ళకు గోచరించింది. చేతులారా పెద్దకోడల్ని బూడిదచేసిన ఘట్టం జ్ఞాపకం వచ్చేసరికి కళ్లు చెమ్మగిల్లాయి. గడ్డం కింద చెయ్యిపెట్టుకుని కొంగుతో కళ్ళద్దుకోడం ప్రారంభించేసరికి మరింత దగ్గరగా జరిగి లక్ష్మీపతి సన్నని గొంతుకతో "అప్పుడే చాలా కాలమునుంచి యీ సమస్య నన్ను చాలా బాధిస్తోంది అమ్మా. చిట్టిబాబుకి కూడా యీ ద్వికళత్రయోగం ఉండి తీరుతుందని మనస్సు నొక్కిచెప్తోంది. అల్లాఅని ఊరుకున్నానా? కోరుకొండ ఆచార్లుగారికి అబ్బాయి జాతకం చూపెట్టాను. చెప్పలేకనే కాబోలు జాతకంలో ఏవో కొన్ని జంట జంట యోగాలున్నాయని నాన్చేశాడాయన. ఇంక నీదగ్గర దాచడం ఎందుకమ్మా. ఈ కురూపి కన్యను కట్టబెట్టి అబ్బాయికి ఆ అడ్డుకాస్తా తొలగిద్దామని నిశ్చయించాను. అయాచితంగా అపార ధనం కూడా సమకూరుతోంది కదా! ఇంతకీ అబ్బాయికి యుక్తాయుక్త విచక్షణ ఇంకా కలగలేదు. మన అదుపాజ్ఞల్లోంచి దాటిన తరువాత ఇల్లాటినిశ్చయాలు కొనసాగవు, పశ్చాత్తాపాలూ తప్పవు. కొంచెం బెట్టుసరి

కర్రా చంద్రశేఖరశాస్త్రి

# ద్వికళత్రయోగం

దూపుతూ అబ్బాయికి ప్రథమంలో యీ సంబంధం చేయడం ఖాయం. తరువాతనా దేవలోకం నుంచి రంభా ఊర్వశుల్ని దిగుమతీ చేయిస్తా. చేతనైనంతవరకూ యోగాలు సరళమార్గంలో దాటిపోయే ప్రయత్నాలు చేసుకోవాలి' అని వెళ్ళిపోయాడు లక్ష్మీపతి.

ముసలితల్లి తులసమ్మకి ఎడమొగంగా తిరిగి 'అవును మరచేపోయాను. నా తెలివి మండా. అన్నిటికంటె పెద్దఘట్టాలే మరచిపోయాను. అవును అందరికీ ద్వికళత్రయోగమే.' చటుక్కున తులసమ్మకేసి తిరిగి చేతులుజోడిస్తూ 'చిట్టిబాబుకికూడా ద్వికళత్రయోగం రాసిపెట్టావా తల్లీ!' అని కళ్లుమూసుకుంది.

* * *

మొదటి కాను పవడంచేత మూడువారాల నుంచీ నలతలో పడింది కామేశ్వరి ఆరోగ్యం. అత్తింటివైపు నాటువైద్యులు, పుట్టింటివారు పెట్టిన పెద్దడాక్టర్లు ఆశానిరాశల్లో ఊగిపోతున్నారు. అసలు తన కోడలి పరిస్థితి ఇంతవరకూ వస్తుందనుకోలేదు లక్ష్మీపతి. అదీగాక కాపురాలు చేయకుండానే తనవంశంలో వారందరికీ ద్వికళత్రయోగం ప్రసాదించారా కోడళ్లు. చిట్టిబాబుకికూడా అల్లాటిస్థితి అప్రాయంలోనే సంభవిస్తుందని ఎదురుచూచాడు చాలకాలం. ఆ శుభముహూర్తం వస్తుందని యెంచుకొనే కదూ ఈ సంబంధానికి తొరసిల్లాడు? అయితేనేం యెంతకాలం ఓపికపట్టగలడు? పిల్ల పెద్దమనిషి అయిన అయిదేళ్లవరకూ నిరీక్షించాడు. నెలలుగడచినకొలది గుండెలో ఆరాటం ఎక్కువయింది. ఉన్నయోగం ఏదో ఎక్కడుంటే మాత్రం తప్పుతుందా అని ధైర్యంచేసి పిల్లని కాపురానికి తీసికొనివచ్చాడు. ఒకేయింటిలో అల్లాటి కొడుకుని ఆ కోడల్ని చూసేసరికి రాగద్వేషాలు ప్రబలడం ప్రారంభించాయి. దానికితోడు పులిమీద పుట్రలా యీ కానుపాకటికూడా దాపురించింది. సంతతిలేని ద్వికళత్రయోగాన్ని ఆనందంతో ఏటే అంది పుచ్చుకున్నారు తామంతా. చిట్టిబాబువిషయంలో ఇల్లా యోగం అడ్డుతిరుగుతుందేమో అని అయోమయంలో పడి అడిగిందే తడవుగా పుట్టింటికి పంపించేశాడు కోడల్ని.

కామేశ్వరి జీవితం ఒక చిరుకురుక్షేత్రం అయిపోయింది. ఇరువైపుల బంధుకోటికి. తన సంబంధం చేసుకోవడంలో ఉండే అంతర్యాన్ని పసికట్టి కామేశ్వరితండ్రి నరసయ్య డాక్టర్ల అడుగులకు కొసులెత్త నారంభించాడు. అంచీలమీద ఎదురూ వాలూ రెండు కొర్లు మందు సీసాలు, ఇంజక్షను బుడ్లు అందీయడానికి సిద్ధంగా ఉంచాడు నరసయ్య. సవ్యసాచుల్లాగ, ఆఆడ డాక్టరు మగడాక్టరు తమ చికిత్సానైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. డాక్టర్ల నిద్దరిని తన యింటిలోనే దిగ్బంధం చేసేశాడు నరసయ్య లాంఛనంగా మాత్రం వియ్యంకుడు పంపిన ఆయుర్వేద వైద్యులు నాడి పరీక్షించి ఏవో మాత్రలు కాగితాలలో చుట్టబెట్టి ఇయ్యసాగారు రెండురోజుల దాకా. పుంఖానుపుంఖాలుగా ప్రయోగించే డాక్టర్ల చికిత్సల మధ్య నిలవడానికి కింక తమకు తావు లేక అరుగుమీదే చతికిలబడ జొచ్చారా ఆయుర్వేద వైద్యులు. లక్ష్మీపతి ఫర్లాంగు ఫర్లాంగు దూరాలలో మజిలీలు ఏర్పాటుచేసి వాటిలో ఎప్పటి కప్పుడు వార్తలు తీసుకొచ్చి చెప్పే సొంతపరివారాన్ని ఏర్పాటు చేసికొని ఉంచుకున్నాడు. అక్కడ జరిగే కార్యక్రమం అంతా మరుక్షణంలో లక్ష్మీపతి శ్రవణకుహరంలోకి ప్రసారమయిపోతోంది. మూడురోజులు గడిచాయి. ప్రయోగించిన దివ్యాస్త్రాలన్నీ ఏ దారిని పోతున్నాయో కాని ఒక్కటీ లక్ష్యం చేరుకొని పని చేయ లేకపోతున్నాయి కామేశ్వరి శరీరంమీద. అయినా రాత్రింబగళ్లు వ్యాధితో ప్రబలంగా పోరాడడం మానలేదా డాక్టర్లు.

భిన్నభిన్న మనస్తత్వాలుగల బంధుకోటి యావత్తూ ఇరుపక్షాలా కామేశ్వరిజీవితాన్ని కామ్యంగా పెట్టుకొని అంతర్వేదిలగాయతు కన్యాకుమారి వరకూగల ముక్కోటి దేవతలకూ మొక్కుబడులకు వాగ్దానాలు చెల్లింపసాగారు. కామేశ్వరి జీవించాలనీ, జీవిస్తుందనీ పుట్టింటి వారి మహదాశయం. చిట్టిబాబు జీవితరంగంమీదనుంచి ఈ పాటికి కామేశ్వరీపాత్ర నిష్క్రమించాలని, నిష్క్రమిస్తుందనీ చిట్టిబాబు ఆత్మీయులు ప్రచ్ఛన్నంగా తలపోయ సాగారు. కన్నవారికి మేరువు, కొన్నవారికి అణువూ అయిపోయింది కామేశ్వరి కళేబరం. చినుకు చినుకులా ఆరంభమయిన ఈ హృదయాశయాలు క్రమేపీ తుపానులా విజృంభింపసాగాయి మనస్సుల్లో ఉభయవర్గాల వారికీ. ప్రభాతంనుంచి విభాతం వరకూ చేయించిన చికిత్సల బలాబలాలు నిర్ణయించుకుంటూ కాలం గడుపుతున్నారు కామేశ్వరి బంధువులు. ఆరోజు కారోజు డాక్టర్ల నిద్దరినీ అగ్నిపరీక్ష చేయసాగింది కామేశ్వరిస్థితి. అయిదు రోజులనుంచీ ఆయింటిలో ఏ ప్రాణీ గుక్కెడు గంగైనా మింగకుండా కలయతొక్కేసుకొంటున్నారు మనస్సుల్ని. ప్రత్యేకం పట్నంలోని పెద్ద మందుల షాపు నొకదాన్ని జబ్బు కుదిరేవరకూ గుత్తకు పుచ్చేసుకున్నాడు నరసయ్యగారు.

వేసినమందులు, గుచ్చిన సూదిపోట్ల ప్రభావంవల్ల తెల్లవారితే మీ పిల్ల ప్రాణానికి మాదీ పూచీ అన్నారు నరసయ్యతో డాక్టరు మహాశయులిద్దరూ. దాన్ని తలక్రిందుచేసి ఈ రాత్రితో కామేశ్వరి జీవితం ఆఖరని డాక్టర్లు చెప్పినట్లు వార్తలందిచ్చాడు లక్ష్మీపతికి దౌవారికుడొకడు. కళ్లలో వత్తులువేసికొని అణువు అణువునా పరిణామాన్ని కనిపెడుతూ ప్రతిక్షణ మహాయుగాల్ని గడుపుతోంది కామేశ్వరి ఆత్మబలగం యావత్తు.

రాత్రి నాలుగు గంటలయింది. డాక్టర్లిద్దరూ పడకకుర్చీలమీదనే కునికిపాట్లు పడుతున్నారు. బంధువర్గమంతా ఆవలింతలతోటి, ఒళ్లు విరుపులతోటి మగతల్లో మునిగిఉన్నారు. కావలసిన మందు సామగ్రి యావత్తూ దిగుమతీ చేసి రెండు కొరులూ ఆజ్ఞలకై నిరీక్షిస్తున్నాయా అన్నట్లు గిన్నెకొంతులతో పహరా కాస్తున్నాయి [illegible] ద్వారాని కిరుప్రక్కలా. చేయవలసిన చికిత్సలన్నీ పూర్తిచేసి కేవలం దైవాన్నే నమ్ముకొని ఉన్నందువల్ల వాతావరణం అంతా నిశ్శబ్దంగా ఉంది.

ఉండి ఉండి హఠాత్తుగా ఒక్కసారి కెవ్వున కేక వేసింది కామేశ్వరి. అందరూ ఉలికిపడిలేచి రోగివద్దకి పరుగులెత్తారు. దీపాలన్నీ పెద్దవిచేసి జనం మంచంచుట్టూ మూగిపోయారు. పెట్టిన గడువైనా దాటకుండా కొంప గుండం చేస్తుందా యీ ఒక్క కూతురూను అని గుండె బాదుకొంది రోగితల్లి. డాక్టర్లిద్దరూ తలవైపు కాళ్ళవైపు నిలబడి సాధనాలతో పరీక్షిస్తున్నారు. ఆడ డాక్టరు నిదానంగా రోగిని పరకాయించి యేదో మగడాక్టరుతో చెప్పి "అందరూ ఒక్కసారి అవతలకి వెళ్ళాలి. ఊఁ! త్వరగా, నడవండి" అని అరుస్తూ గది తలుపులు రెండూ గభాలున వేసేసింది. గదిలోంచి ఓసారి మెల్లగాను, మరోసారి గట్టిగానూ మూలుగుతోంది రోగి. అందరూ చెవులు రిక్కించి సూత్రప్రాయంగా వినబడే ప్రతీమూలుగుకి గుసగుసలతో భాష్యలుపక్రమింప సాగారు.

సరిగా గడియారం ఇంక పదినిమిషాలకి ఆరు కొడుతుందనగా గభీలున తలుపులు రెండూ తెరుస్తూ ఆడడాక్టరు "పంతులుగారూ! కవల మగబిడ్డలండీ!!" అని అరిచింది కామేశ్వరి తండ్రిని సమీపిస్తూ. ★




'భాగం భాగ్' లో శశికళ, స్మృతిబిశ్వాస్.

గ్యాన్‌ముఖర్జీ నిర్మించిన 'షట్రంజ్' లో మిశ్రా, మీనాకుమారి, మజ్నూ.



టి. సూర్యకుమారి.



అనుపమ ఫిలిమ్సు వారి ప్రథమ సాంఘిక చిత్రంలో సూర్యకాంతం, రమణారెడ్డి.

# ఎరిక్ జాన్‌స్టన్ సూచన

'భారత జాతీయతను సంస్కృతిని ప్రతిబింబించే చిత్రాలను అమెరికా హర్షిస్తోంది. ఆదరిస్తుంది.' అని అమెరికా మోషన్ పిక్చర్ అసోసియేషన్ అధ్యక్షుడు ఎరిక్ జాన్‌స్టన్ మొన్న కలకత్తాలో విలేఖరులతో అన్నారు. ఈయన ప్రపంచ పర్యటన చేస్తూ మార్చి 21 న మనదేశం వచ్చారు.

బొంబాయిలో భారతి ఫిలిం ఫెడరేషన్ వారు ఆయన గౌరవార్థం మార్చి 21 న విందు చేశారు. ఈనాడు భారత దేశంలో చలన చిత్ర నిర్మాణ పరిశ్రమను గురించి స్వయంగా తెలుసుకోవడానికే తామువచ్చారనీ, పరిశ్రమ స్థితిగతులతోపాటు లక్ష్యాలనుకూడా అవగాహన చేసుకోవాలని సంకల్పించారనీ జాన్‌స్టన్ అన్నారు. చలన చిత్రాల ప్రాధాన్యాన్ని వివరించి, ఈ పరిశ్రమ కేవలం స్వదేశంలో మార్కెట్‌కు పరిమితమై వర్ధిల్లడం అనేది సాధ్యం కాదనీ, అమెరికన్ చిత్ర పరిశ్రమ విషయంలో ఈ మాట అక్షరాలా నిజమనీ ఆయన అన్నారు.

భారత చలనచిత్రపరిశ్రమ గురించి ప్రస్తావిస్తూ సద్భావాన్ని పెంపొందింపడానికి, భారత చలనచిత్ర నిర్మాతలు వీటి ద్వారా ప్రశంసనీయమైన సేవ చేస్తున్నారని జాన్‌స్టన్ అభిభాషించారు. వినోదం కోసం తీసిన చిత్రాలలోకూడా తెలుసుకోతగ్గ విషయాలెన్నో పొందుపరచబడి ఉన్నాయని ఆయన మెచ్చుకున్నారు. ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎస్. ఎస్. వాసన్ మాటాడుతూ, ఎరిక్ జాన్‌స్టన్ శక్తి సామర్థ్యాలను, వ్యవహార దక్షతను ప్రశంసించారు.

ఎరిక్ జాన్‌స్టన్ భారతీయ నిర్మాతలతో భారత చలనచిత్ర పరిశ్రమపై సమగ్ర చర్చలు జరుపుతారు.

అమెరికన్ చిత్రాలకు భారత దేశంలో మంచి మార్కెట్ ఉంది. అయితే భారతీయ చిత్రాలకు మాత్రం అమెరికాలో ప్రదర్శనావకాశాలు లభించడం లేదు. ఈ విషయమై మన పరిశ్రమ ప్రముఖులు ప్రయత్నాలు చేస్తునే ఉన్నారు.

లోగడ, అమెరికన్ సంస్థ బెల్ అండ్ హావెల్ కంపెనీ అధ్యక్షుడు చార్లెస్ హెచ్. పెర్సీ బొంబాయి వచ్చినపుడు, ఒక సందర్భంలో మాట్లాడుతూ, ఈ పరిస్థితిలో వైపరీత్యాన్ని గుర్తించామనీ, వ్యాపారం అన్నపుడు ఇచ్చి పుచ్చుకోవడాలు రెండూ జరగవలసి ఉన్నదనీ, అమెరికా ఎప్పటికిమల్లేనే భారతీయ చిత్రాల విడుదలకు ఆస్కారం

ఇవ్వక పోవడం అక్కడి పరిశ్రమకు కూడా శ్రేయస్కరం కాదనీ అన్నారు. భారతీయ చిత్రాలకు అమెరికాలో మార్కెట్ చూపించడానికి తాము వ్యక్తిగతంగా ప్రయత్నాలు చేస్తామని కూడా ఆయన హామీ ఇచ్చారు. ఇది జరిగి నాలుగు వారాల తిరిగే సరికి, అమెరికా చలనచిత్ర పరిశ్రమకు బాధ్యతగల ప్రతినిధి అయిన ఎరిక్ జాన్స్టన్ రావడం జరిగింది.

ఈయన కూడా చలనచిత్రాలు, అవి తయారైన దేశంలో మార్కెట్‌కే పరిమితమై వర్ధిల్లలేవనీ, అంతర్జాతీయంగా ప్రదర్శించడానికి అవకాశం ఉండాలనీ విశదం చేశారు.

అయితే, అలా ప్రదర్శించినపుడు జాతీయత లేని చిత్రాలు ఏ దేశంలో గాని ఆదరించబడే అవకాశాలు ఉండవు. మన చిత్రాలు మరో దేశంలో ప్రదర్శించినపుడు ఆ దేశీయులకు మన ఆచార సంప్రదాయాలు జీవనవిధానాలు, జీవితం పట మన దృక్పథాలూ, మన లలితకళల స్వరూప స్వభావాలు మొదలైనవాటి గురించి తెలుసుకోవడానికి వీలుండాలి. అప్పుడే వాళ్లకి ఆసక్తి కలుగుతుంది. అంతర్జాతీయ సుహృద్భావం, ఒకరినొకరు అర్థం చేసుకోవడం మొదలైన ఉద్ఘాటనలకు, ఉద్ఘోషలకూ, అర్థం కనబడుతుంది.

నిజానికి జాతి సంస్కృతిని, జీవన విధానాలను, వాస్తవ స్థితిగతులను, ప్రతిబింబిస్తూ, సజీవమైన చిత్రాలు నిర్మించడానికి చిత్తశుద్ధితో ప్రయత్నించి, ఫలితాలు సాధించినవి రెండు దేశాలు. మొదటిది ఇటలీ, రెండవది జపాన్.

హాలీవుడ్ చిత్రాలలో ఈ ప్రయత్నమూ, ఈ తరహా ఏమంత కనబడదు. హాలీవుడ్ చలనచిత్ర పరిశ్రమ ప్రముఖులు పలువురు ఈ మాట అన్నారు. అమెరికన్ చిత్రాలు చూచి, చికాగోలో అందరూ దొంగలూ ఖూనీకోరులూ అని ఎన్నడూ భావించరాదనీ, అవి అమెరికన్ జీవితాన్ని ప్రతిబింబించటం లేదనీ వారు స్పష్టంగా చెప్పారు. ఇక మన దేశంలో ఈనాడు హాలీవుడ్‌ను అనుకరించడం ఎక్కువైపోతోంది. అక్కడి పంథాలో ఇక్కడ నిజంగా లేకపోయినా చిత్రాల్లో మాత్రం నైట్ క్లబ్‌లు, పాటలు, ఓవర్ కోట్లు తొడుక్కు తిరిగే ఆసాములు, కనబడటం మామూలు అయిపోయింది. మనవి కాని మన తత్వాలు చిత్రించబడుతున్నాయి నృత్యాలూ అలాగే తయారయ్యాయి.

ఇక్కడికి వచ్చే అమెరికన్ చిత్రాలలో అమెరికన్ జీవితాన్ని ప్రతిబింబించేవి చాలా తక్కువ. అటువంటపుడు వాటిని మనం అనుకరించి, చిత్రాలు నిర్మించి, అమెరికా పంపిస్తే, అక్కడి ప్రజలు ఎలా హర్షిస్తారు? అమెరికన్లే కాదు, ఏ దేశం ప్రజలూ నిజానికి ఈ పద్ధతిని హర్షించరు అసలు ఆసక్తే కలుగదు.

అమెరికన్ ఫిలిం పరిశ్రమ ప్రతినిధి ఎరిక్ జాన్స్టన్, ఆ మధ్య వచ్చిన చార్లెస్ పెర్సీ, బ్రిటిష్ ఫిలిం సంస్థ ప్రతినిధి మేరీ సెటన్‌లు ఈ విషయంలో నిష్కర్షగా తమ అభిప్రాయాలు చెప్పారు. ఒక్క అమెరికన్ మార్కెట్ మాత్రమే కాక, అంతర్జాతీయ మార్కెట్‌లో స్థానం సంపాదించాలంటే మన చిత్రాలపై మన ముద్రే ఉండడం ముందిది అవసరం.



నరసూవారి 'భలేరాముడు' లో నాగేశ్వరరావు, కేశవరావు.



జి. వి. ఎస్. వారి "సొంతవూరు"లో రమణారెడ్డి, కుటుంబరావు, చంద్రకుమారి, సూర్యకాంతం.

# బొంబాయి సినిమా లేఖ

ఆసియా ఫిలిం సొసైటీ ఆధ్వర్యాన బ్రిటన్‌లో జరిగే భారత టాకీ రజతోత్సవాల సందర్భంలో, ఉత్తమ భారతీయ చిత్రాలు మీర్జాగాలిబ్, కుందన్, అనార్కలి, జాగృతి, నాగిన్, దోబిఘాజమీన్‌లు ప్రదర్శించబడుతున్నాయి. లండన్‌లోని 'స్కాలా' థియేటర్‌లో జరిగే ఈ వారం రోజుల ప్రదర్శనం ముగియగానే, ఈ ఆరింటిలోనూ, ఉత్తమ చిత్రాన్ని, నటీనటులను, దర్శకుడిని, సంగీతదర్శకుడిని, కథను ప్రేక్షకులు ఎన్నిక చేస్తారు ఆ మేరకు, ఆసియా ఫిలిం సంస్థ, ప్రత్యేక బహుమతులిచ్చి, ఆయా కళాకారులను గౌరవిస్తుంది.

ఆసియా ఫిలింసొసైటీ కార్యదర్శి శ్రీ ఇ. ఎ పోచీ మార్చి 14 న బొంబాయి వచ్చి, మొట్టమొదటి భారతటాకీ నిర్మాత శ్రీ అర్దేషిర్ ఇరానీని సందర్శించారు. లండన్‌లో జరిగే ఈ చలన చిత్రవారోత్సవాలకు ఆయన సందేశాన్ని పుచ్చుకున్నారు. ఈ ఉత్సవాలు భారత దేశానికేకాక, ఆసియా దేశాలన్నిటికీ గర్వకారణమని శ్రీ పోచీ బొంబాయిలో అన్నారు. గత సంవత్సరం కూడా బ్రిటన్‌లో భారతీయ చలన చిత్రోత్సవం విజయవంతంగా జరిగింది. దరిమిలా బ్రిటన్‌లో 70 లక్షలమంది భారతీయ చిత్రాలను చూడడానికి వీలుగా వాటని టెలివిజన్‌లో ప్రదర్శించడానికి అవే దోహదం చేశాయి అని కూడా ఆయన చెప్పారు. ఈ విధంగా భారతీయ చిత్రాలను ఇక్కడ ప్రదర్శించడం ద్వారా, క్రమేపీ భారతీయ చిత్రాలను, ఇతర ఆసియా దేశాల చిత్రాలనూ బ్రిటన్‌లోనూ యూరప్ దేశాలలలోనూ విరివిగా ప్రదర్శించడానికి దోహదంచేసి దారి కల్పించడమే తమ లక్ష్యమని ఆయన అన్నారు. లండన్‌లోని వెస్టెండ్ ప్రాంతంలో ఒక థియేటర్ సంపాదించి, అక్కడ భారతీయ చిత్రాలూ ఆసియా దేశాల చిత్రాలు ఏడాది పొడుగునా ప్రదర్శించడానికి వసతి ఏర్పాటు చేయాలని ఆసియా ఫిలిం సొసైటీ చాలకాలంగా ప్రయత్నాలు చేస్తూ వచ్చింది. ఈ ప్రయత్నం సఫలం కావడానికి, పలువురు అభిమానులూ శ్రేయోభిలాషులూ తగిన పెట్టుబడి పెట్టి తోడ్పడుతామన్నట్లు శ్రీ పోచీ వెల్లడించారు. ఈ వర్తమాన సంవత్సరంలో ఈ సంఘం భారత, పాకిస్తాన్, చైనా, జపాన్, ఇండొనీషియా, మలయా, ఈజిప్టుదేశాల చిత్రాలను ఇక్కడ ప్రదర్శించడానికి ఈ సంఘం కార్యక్రమం రూపొందించుకుంది. భారతదేశంనుండి తీసుకునే చిత్రాలు మయూర్ పంఖ్, హామ్లెట్, వారిస్, నాస్తిక్, మునీంజీ, సీమా, ఛోటా భాయ్, జాదూ, న్యూథియేటర్స్‌వారి దేవదాస్. ఈ సంఘం లండన్‌లోని స్కాలా థియేటర్‌లో మూడువారాలకోసారి ఆసియా దేశాల చిత్రాలను ప్రదర్శిస్తూ ఉంటుంది.

* * *

భారత చలనచిత్ర పరిశ్రమకు 1956 మార్చి 14 చరిత్రాత్మకదినం. భారతదేశంలో టాకీ పరిశ్రమకు 26 వ పుట్టినరోజు. శ్రీ అర్దేషిర్ ఇరానీ నిర్మించిన మొట్టమొదటి భారతీయ టాకీ చిత్రం, 'ఆలం ఆరా' 25 సంవత్సరాల నాడు—సరిగ్గా 1931 మార్చి 14 న మెజెస్టిక్

థియేటర్‌లో విడుదల అయింది. అయితే ఈ నాడు, అతివైభవంగా రజతోత్సవాలు జరుగవలసినవేళ, నేటి చలనచిత్ర పరిశ్రమ ఏమీ చెయ్యకుండా ఊరుకుంది. ఈ ఉత్సవాలు దేశవ్యాప్తంగా భారీఎత్తున జరపాలని గత ఏడెనిమిది నెలలుగా పెద్దలు అంటునే ఉన్నారు.

ఏర్పాట్లు చేయడానికి కమిటీలు ఏర్పాటయ్యాయి. గత డిసెంబరు 25 న దేశంలోని థియేటర్లన్నీ ఈ ఉత్సవ నిర్వహణకై, ఒక ఆట వసూళ్లు విరాళంగా ఇవ్వాలని పరిశ్రమ ప్రముఖులు విజ్ఞప్తిచేశారు. ఇవన్నీ ఇలా ఉన్నా, ఏ కారణంవల్లనయితే నేం, మొత్తానికి అసలు ఉత్సవాలు వాయిదా పడ్డాయి. అసలికముందయినా జరుగుతాయా అని ఒకానొక ప్రముఖనిర్మాత సందేహం వెలిబుచ్చారు. పోనీ ఉత్సవాలు వాయిదాపడ్డా, కనీసం మొదటి టాకీనిర్మాతగా శ్రీ అర్దేషిర్ ఇరానీని, సన్మానించడమైనా జరిగి ఉండవలసింది. అలా లాంఛనంగా కూడా పరిశ్రమ పేరిట ఏమీజరుగలేదు. ఫెడరేషన్ వారి వైఖరి చూడగా, ఉత్సవాలు జరిపితే భారీఎత్తున జరపాలి, లేకపోతే అసలు మానుకోవాలి అన్న భావం కనబడుతూంది. వారు ఆలోచించిన కార్యక్రమాలసరళి పరిశీలించినా కూడా టాకీలకు పితృతుల్యుడైన శ్రీ అర్దేషిర్ ఇరానీకి ఏమంత ప్రాముఖ్యం ఇచ్చేటట్లు కనబడదు. నిజానికి ఇందులో ఆశ్చర్యపడవలసింది కూడా ఏమీ లేదు. మార్గదర్శకులైన పెద్దలను ఫిలిం పరిశ్రమలోని వారు గౌరవించిన సన్మానించిన సందర్భాలేం కనబడవు. చలనచిత్ర పరిశ్రమకు తండ్రివంటివాడు, పూజ్యుడుఅయిన దాదా సాహెబ్ ఫాల్కే వర్ధంతినే ఎవరూ జరుపటంలేదు.

పరిశ్రమ తరపున ఎవరూ ఏమీచెయ్యకపోయినా, పండుగనాడే పండుగ జరిపిన వారు ఫిలింజర్నలిస్టులు. కొత్తగా ఏర్పడ్డ ఈ ఫిలిం జర్నలిస్టు సంఘం మార్చి 14 న, నిరాడంబరంగానే అయినా గౌరవ పురస్సరంగా, ఉత్సవం జరిపి శ్రీ అర్దేషిర్‌ను సన్మానించారు.

ఇప్పటికైనా ఫిలింపరిశ్రమకు సంబంధించిన వివిధ సంఘాలవారు, యథోచితంగా సమావేశాలు జరిపి, విధ్యుక్త ధర్మం నెరవేర్చడం సముచితం.

* * *

కొంతకాలంగా మరుగునపడ్డ కామినీ కౌశల్ త్వరలోనే తిరిగి వెండితెరపై కనబడబోతున్నది. ఉమాచిత్రాఅనేసంస్థ నిర్మిస్తున్న 'ఆబ్రూ' అనే చిత్రంలో ఈమె నాయిక భూమిక నిర్వహిస్తున్నది. చతుర్భుజ్ జోషి దర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో కిశోర్, స్మృతిబిశ్వాస్, మోతీసాగర్ మొదలగువారు నటిస్తున్నారు. సంగీతం బులో. సి. రాణి.

* * *

నటుడుగాను, రచయితగాను పేరు తెచ్చుకున్న పాల్‌మహేంద్రా ఇప్పుడు చిత్ర నిర్మాణానికి పూనుకొన్నాడు. 1940 లో పంజాబీ చిత్రం 'యమ్లాజాత్' లో ఇతడు నాయకుని పాత్ర నిర్వహించాడు. దరిమిలా న్యూథియేటర్, ప్రభాత్, బాంబేటాకీస్,



రాజ్యం పిక్చర్సవారి 'హరిశ్చంద్ర'లో ఒక సన్నివేశం.

## భారతదేశంలో టెలివిజన్ కేంద్రం

బొంబాయి నగరంలో టెలివిజన్ కేంద్రం ఒకటి నెలకొల్పడానికి కేంద్రప్రభుత్వం పథకం వేశారు. 1958 నాటికి నిర్మాణం పూర్తి అవుతుందట. ఇది ఒకవిధంగా ప్రయోగాత్మకం అన్నమాట. ఇక్కడ నెలకొల్పేది 5 కిలోవాట్ల ప్రసారశక్తి ఉండే కేంద్రం. విశాల బొంబాయి నగరంలో 40 చతురపుమైళ్ల మేరలో ఇది చిత్రాలు ప్రసారం చేయగలుగుతుంది. నిర్మాణానికి అవసరమైన సాంకేతిక సహాయం, పరికరాలు విదేశీయ సంసలనుండి సమకూర్చుతున్నారు.

ఫిలిప్స ఎలక్ట్రానిక్స కంపెనీ ప్రతినిధి ఈ మధ్య ఈ విషయమై మాట్లాడుతూ, ఈ కేంద్రం నెలకొల్పడానికి భవననిర్మాణవ్యయంకాక, కెమెరాలు, ఏరియల్ ప్రసారయంత్రాలు మొదలైనవాటికి ఆరులక్షలు ఖర్చవుతుందన్నారు పోతే, టెలివిజన్ సెట్ ఒకొక్కటి 1500 రూ॥లకు దొరుకుతుందన్నారు. ఈ కేంద్రం నెలకొల్పితే, బొంబాయిలో మొదటి రెండేళ్లలోను పదిహేను ఇరవైవేల టెలివిజన్ సెట్‌లు అమ్ముడుపోవచ్చునని సూచించారు.

ఈ మధ్య భారత పారిశ్రామిక ప్రదర్శనంలోను, అతఃపూర్వం మద్రాసులోనూ టెలివిజన్ ప్రసారయంత్రాలు ప్రదర్శింపబడ్డాయి.

ప్రయోగాత్మకంగా, దగ్గర చోట్లకు ప్రసారం చెయ్యాలంటే, కేబుల్స ఉపయోగిస్తారు. అంటే టెలిఫోన్‌పద్ధతి అన్నమాట.

దూర ప్రాంతాలకు ప్రసారం చేయడం రేడియోపద్ధతి. అప్పుడు తీగలప్రమేయం లేదు.

## బొంబాయిసినిమా లేఖ

రంజిత్, బిమల్‌రాయ్ ప్రొడక్షన్స మొదలైన సంస్థలలో పనిచేశాడు. మహేంద్రా నిర్మించనున్న చిత్రానికి కథ సంభాషణలూ ఆయనే వ్రాసుకున్నారు. రాజానవాతే దర్శకుడు. సంగీతం ఓ. పి. నయ్యర్. వైజయంతిమాల, కిశోర్, జగదీప్‌సేథీ, రూప్‌కుమార్‌లను బుక్‌చేశారు. మహేంద్రా కూడా ఇందులో నటిస్తారు.

* * *

ఈగిల్ ఫిలింస్ నిర్మించిన 'సిపాహ్‌సాలార్' మార్చి 23 న విడుదల అయింది. సాహసోపేతమయిన ఒక సైనికుడి కథ. ఈ భూమికను షమ్మీకపూర్ నిర్వహించాడు. నాకయిగా నదీరా నటించింది. కుంకుం, కమల్‌మెహ్రా, శ్యాంకుమార్, శాంసన్, హెలెన్ మొదలైనవారు కూడా పాల్గొన్నారు. దర్శకుడు మహముద్‌హుసేన్.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయివిలేఖరి)

## బెంగాల్ ఫిలిం పరిశ్రమ
### ప్రభుత్వం చేస్తున్న అపూర్వ సహాయం

"పథేర్ పాంచాలి" చిత్రం కొంత నిర్మించబడ్డ తరువాత డబ్బులేక ఆగిపోయిన వేళ ఆదుకొని తగినసహాయంచేసి నిర్మాణం పూర్తిచేయించిన పశ్చిమబెంగాలు ప్రభుత్వం ఇప్పుడు ఆరాష్ట్రంలో ఫిలిం పరిశ్రమ అంతటికీ గొప్పసహాయం చేయ నిశ్చయించింది. ఉత్తమచిత్రాలు నిర్మించడానికి తక్కువఖర్చులో వసతులు కల్పించి నిర్మాతలను, దర్శకులను ప్రోత్సహించే నిమిత్తం ఆధునిక పరికరాలన్నిటితో సమగ్రమైన స్టుడియో ఒకటి సహకార పద్ధతులపై నెలకొల్పి నడిపించాలని వారు పథకం వేశారు. దీనికై లక్షావిభైవేలరూపాయలు మంజూరు చేశారు.

ఇదేకాక, "పథేర్ పాంచాలీ" చిత్రంవల్ల వచ్చేలాభాలతో ఒకనిధి నెలకొల్పి, రచయితలను ప్రోత్సహించడానికి దానిని వినియోగించాలనికూడా నిశ్చయించారు.

దేశం అంతటికీ ఆదర్శప్రాయమైన పద్ధతిలో పశ్చిమబెంగాలు ప్రభుత్వం ఈ సత్కార్యానికి పూనుకున్నది. దీనికంతటికీ కారకుడైన వ్యక్తి-రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్ అభినందనీయుడు.

## సినిమా వార్తలు

హాలీవుడ్ చలనచిత్ర పరిశ్రమలో ఉన్నతంగా ఎంచబడే 'ఆస్కార్' బహుమతులు, 1955 వ సంవత్సరపు చిత్రాలలో ఈ క్రిందివాటికి లభించాయి. మార్చి 21 న బహుమతి ప్రదానం జరిగింది.

ఉత్తమ విదేశీ చిత్రం 'సామురాయ్' (జపాన్).

ఉత్తమ అమెరికన్ చిత్రం 'మార్టీ' యునైటెడ్ ఆర్టిస్ట్స)

ఉత్తమ నటుడు: ఎర్నెస్ట్ బోర్గ్నైన్ (మార్టీ).

ఉత్తమ దర్శకుడు: డెల్బర్ట్‌మాన్(మార్టీ)

ఉత్తమ నటి: ఇటాలియన్ తార అనా మగ్నానీ.

(పారమౌంట్ వారి 'రోజ్ టాటూ')

నటుడు తను ధరించే పాత్ర తాలూకు ఉద్వేగాలన్నీ అనుభవిస్తూ నటించాలా? నిజంగా కన్నీరు కారుస్తూ, నిజంగా రోదిస్తూ నటిస్తే నటన బాగుంటుందా? నటుడు పాత్రలో పూర్తిగా లీనమైపోవాలా? ఇంగ్లీషు రచయిత జాన్సన్ ఈవిషయమై చర్చిస్తూ "హంతకుని పాత్ర ధరించే నటుడు ఒక నిమిషంపాటైనా తను హంతకుడని భావించగలిగితే, ఆ నటుణ్ణి నాటకం కాగానే ఉరి తీసెయ్యడం మంచి"దని తేల్చాడు.

కేంద్ర సెన్సారు బోర్డులో ఫిలింపరిశ్రమ ప్రతినిధులకు ఇతోధికంగా స్థానాలు ఇవ్వాలని నిర్మాతల గిల్డు సభ్యులు కొందరు సెన్సారుబోర్డు అధ్యక్షుని కోరారు.

* * *

టాల్‌స్టాయ్ నవల 'వార్ అండ్ పీస్' చిత్ర నిర్మాణం పూర్తి అయింది. పాంటి డిలారెంటిస్ అనే ఇటాలియన్ దీనికి నిర్మాత. దర్శకుడు హెన్రీకింగ్ హెన్రీఫాండా, మెల్ ఫెరర్, ఆడ్రీ హెప్‌బర్న ప్రభృతులు నటించారు. ఈ చిత్రానికి ఇప్పుడు ఎడిటింగ్ జరుగుతోంది.

* * *

ఆగ్నేయ ఆసియా దేశాలలో పర్యటించడానికి భారతీయ సాంస్కృతిక ప్రతినిధివర్గం ఒకటి ఏప్రిల్ 14న బయలుదేరుతున్నట్లు తెలిసింది. శ్రీ పృథ్వీరాజ్ కపూర్ దీనికి నాయకత్వం వహిస్తారట.

అంతర్జాతీయ బాల చలన-చిత్రసంస్థను బ్రసెల్స (బెల్జియం)లో నెలకొల్ప నిశ్చయించబడింది. ఐక్యరాజ్య సమితి విద్యా వైజ్ఞానిక సంఘం దీనికి ఐదు వేలడాలర్ల విరాళం ఇస్తుంది. దేశదేశాలలలో బాల చలనచిత్రనిర్మాణం, వాటిని ప్రదర్శించడం మొదలైన కార్యక్రమాలను ప్రోత్సహించడానికీ, సమన్వయించడానికీ ఈ సంస్థ కృషి చేస్తుంది. ఇదేకాక, ఆయా ఫిలిం సంస్థలు అనేక భాషలలో చిత్రాలు నిర్మించడానికి ఇది దోహదం చేయాలని కూడా నిశ్చయించారు. 

# అరిగిపోయిన చెప్పులజోడు

ఆ ఊళ్ళో రామప్పంతుల్ని ఎరగనివారెవరూ ఉండరు. అంటే 'అందరికీ అందుబాటులో ఉండేటట్లుగా చేసుకోవడంలోనే ఉందోయ్ మన ప్రత్యేకత' అని ఆయన చెప్పే ముక్కలు అతురాలా అబద్ధం కాకపోవడమే కాకుండా నిజంగా నిజం!

పనిలో పని చూసిపోదామని ఉబుసుపోక సుబ్బమ్మక్క ఇంటిలోకి తొంగి చూశాడు. తొంగిచూశాడో లేదో కుయ్యో మన్నాడు.

'ఏమిట్రా.. ఏం మునిగింది' అంటూ చేతిలో తులసితావళం తిప్పుతూ, 'రాధాస్వామి,' 'రాధాస్వామి' అంటూ ఆరని తడి బట్టతో అమాంతంగా గావుకేకతో పతిస్తూన్న రాధాస్వామిని వదలి ఎదురుగా ఉన్న పంతుల్ని దర్శించింది.

'ఏమిటి కొంప మునిగిపోయినట్లు...' అనబోయి నాలిక కొరుక్కుని—

'మీరా పంతులుగారూ, లోకయ్యను కున్నా...ఇంతకీ కనిపించడమే మానేశారు' అంటూ ఆయన స్థితికి చింతిస్తూ 'ఏం' అన్నట్లు చూసింది.

'కుట్టిన తేలు గుణవంతురాలే, యేడిచింకే...' అంటూంటే ఆ వృశ్చికరాజను ధీమాగా వెళ్ళిపోతోంది.

'ఆ చెప్పుతో రాసెయ్యరాదూ పంతులుగారూ దాన్ని...'

'ఆ పాపం నాకెందుకు?'

'పాప మేమిటండీ, హానిచేసే జంతువుని'

'అది హానిచేసే దయితే మాత్రం, మనం కూడా హాని చెయ్యాలని ఎక్కడుంది?'

'మంత్రమేస్తా నుండండి' అని యేదో నాలుగుసార్లు పైనుంచి క్రిందకు రాసింది. బాధ తగ్గినట్లు కనిపించలేదు.

'లోకయ్య మంత్రానికిగాని తగ్గదేమో' అన్నారు అక్కడెవ్వరో. సుబ్బమ్మగారికి మనిషికి రావలసినంత కోపము వచ్చింది. కాని మళ్ళా మనిషి తమాయించుకున్నట్లుగానే తమాయించుకుంది.

'ఈ మధ్య శనివారా లుంపటం మానేశాను. అందువల్ల పట్టు తప్పిందేమో?'

'ఏమో కాదు. నీ మంత్రం ఎప్పుడు పని చేసిందని? అది సరేగాని లోకయ్యని కాస్త రప్పిద్దూ.'

ఇలా అంటూంటేనే సాక్షాత్తు లోకయ్య రానే వచ్చాడు, పూర్వకాలంలో తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమైనట్లు.

'రావయ్యా, లోకయ్యా, నన్ను చంపేస్తోందయ్యా, మంత్రం వెయ్యవయ్యా' అనే అష్ట్రం పూర్తిగాకముందే లోకాభిరామయ్య మంత్రం వెయ్యటము తగ్గటము జరిగాయి.

'మిగతా విషయాల మాట ఎట్లా వున్నా లోకయ్య మంత్రం మాత్రం మహాచక్కగా పారుతుంది'

'మనం ఒప్పుకోంగాని మిగతా విషయాలలో మాత్రం ఏం తక్కువలెండి?'

కోరగా చూశాడు రామప్పంతులు.

"ఏముందీ అందరి విషం నీలోనే ఉంది గాబట్టి...'అని కొంచెం ఆగి మళ్లా 'రాధాస్వామి', 'రాధాస్వామి' అంటూ తావళం తిప్పుతూంది సుబ్బమ్మక్క.

'నీ నోట్లోనే ఉందే విషం అంతా. నీ దసలు.విషప్పుచ్చపు నోరు'

అసలు ఈ గ్రంధానికంతకు గ్రంథకర్త సుబ్బమ్మక్క. సూత్రధారుడు రామప్పంతులు. లోకాభిరామయ్య వాళ్లపాలిట ఒక విలన్.

సీతయ్య చచ్చిపోతూ, చచ్చిపోతూ తన భార్య వెంకాయమ్మనూ కూతురు లక్ష్మినీ యిరుగు పొరుగులో ఉంటూ చేదోడు వాదోడుగా ఉండే రామప్పంతులు, సుబ్బమ్మక్కల అధీనం చేసిపోయాడు. ఉన్నదంతా స్థిరాస్థి కాదు. భోషాణంలో రూపాయల సంచులు, పాతరలో వడ్లు, కాలదోషం పట్టడానికి సిద్ధంగా ఉన్న ప్రామిసరీనోట్లు-ఇదీ సీతయ్య ఆస్తి.

'ఆస్తి జాగ్రత్త పెట్టకోకపోతే నా అస్తికతే మీకు మిగిలేది' అని వగస్తూ వగస్తూనే వదిలాడీ లోకాన్ని. బ్రతికుండగా తన భార్యకు డబ్బూ దస్కం సంగతి ఏమీ తెలియనివ్వలేదు గాబట్టి అవసానకాలంలో రామప్పంతులు, సుబ్బమ్మ ఆప్తులైనారు. అంతకుముందునుంచీ వాళ్ళ బాగోగులు చూసే లోకయ్య మట్టిగొట్టుకుపోయాడు. అంటే కుటుంబపు లోటుపాట్లు తెలియడం వల్ల కాజేస్తాడేమో నని జాగ్రత్తపడ్డాడు సీతయ్య. అందుకనే రామప్పంతులు 'నేనున్నానుగా, నేను చూసుకుంటూనే ఉదంతా. నువ్వు రామా, కృష్ణా అనుకో. తరణోపాయం' అంటూంటే లోకయ్యకు ఆశ్చర్యం కల్గించింది.

రామప్పంతులి సంగతి లోకయ్యకు బాగా తెలుసు. వీళ్లు కబళిస్తారని తెలిసున్నా చేసేది లేక ఊరుకొన్నాడు అప్పటికి.

'లోకయ్య యింతకూ ఏం పని మీద వచ్చినట్లు?' అని రామప్పంతులనడంతో లోకయ్యకు కోపం వచ్చింది. కాని దాన్ని పైకి పొక్కనియ్యకుండా—

'ఏదో సీతయ్యగారి వ్యవహారం తేలుద్దామని'

'తేల్చేందు కేముంది' అని రామప్పంతులు సుబ్బమ్మవైపు తిరిగితే,

'అవును తేల్చేందు కేముంది, తేల్చిన వ్యవహారానికి' అంది.

'అవును. తేల్చేందు కేముంది, తేల్చిన వ్యవహారానికి-అయినా తేలుస్తేనేగాని తేలదేమో నని'

'ఇది నీ సొంత అభిప్రాయమా?'

'అభిప్రాయాలు అడక్కుడేనికి తీసుకు రావడం? తీసుకోనేవాళ్ళే ఉండాలిగాని కావలసినన్ని. ఇంతకీ అమ్మాయి పెళ్ళి ఒకటి తేలాలి రెండవది...

'విట్లన్నిటినీ నువ్వు అనవసరంగా'

'కాదు అవసరంగానే.'

'ఏమిటా అవసరం' అంటూ మిర్రి మిర్రి

'మురళీ'

 **అరిగిపోయిన చెప్పులజోడు** 

చూసి మళ్లా 'రాధాస్వామి' 'రాధాస్వామి' అంటూ ఉండిపోయింది, సుబ్బమ్మ.

'ఏదో తగిన సంబంధం చూసి...'

'అంటే.'

'నీకెందుకు చెప్పు ఈసంగతులన్నీ. అతడు బ్రతికుండగా చక్కా బెట్టావుగా చాలదూ.'

'ఇదిగో రామప్పంతులూ! నీ సక్కా జేతులు నే నెరగనివి కావు. నువ్వు వేసే ప్రతి వేషమూ నాకు తెలియకుండాపోదు తెలుసా?'

'తెలిస్తే తెలిసిందిలే. అయినా తెలిసేందు కేముంది యిందులో. ఏమన్నా పోగేసిపోయాడా సీతయ్య మున్ముల్నందరినీ ఏరుకు తినమని.'

'ఏయ్ సుబ్బమ్మా, ఈ లోకయ్య సంగతి తెలుసు నీకు.'

'ఓ తెలియకేం.'

'కాని నీకు తెలిసినదానికంటె తెలియనిది చాలా ఉంది...' అంటూ యింటిదారి పట్టాడు.

అటు లోకాభిరామయ్య వెళ్ళగానే రామప్పంతులు కొంచెం చిక్కముఖంతో.

'అయితే సుబ్బమ్మక్కా ఏమంటావు' అన్నాడు.

'ఆ.... అనేందుకేముంది. ఆ మూడు ముళ్ళూ పడ్డాయంటే సరి...రాధాస్వామి దయవల్ల అన్నీ చక్కబడతాయి.'

'అది సరేననుకో.'

'ఇంకేముంది, శుభస్య శీఘ్రం' అని కొంచెం ఆగి,

'అంతా రాధాస్వామి కృప అనుకో. అయినా మనలో మనమాట ఆహారంపట్ల, వ్యవహారంపట్ల మొగమాటం ఉండకూడదన్నారు.'

'అయినా మనలో మనకు మొగమాటం ఏమిటి చెప్పు సుబ్బమ్మక్కా' అన్నాడు.

'మరి నా సంగతో.'



'నీకేం, నిక్షేపంలాగ నీ కేలోటూ రాకుండా నాదగ్గర ఉండు...' అని రామప్పంతులు పూర్తిచెయ్యకుండానే

'అదేమిటి పంతులుగారూ, స్వతంత్రమో, స్వర్గలోకమో అన్నారు. నా కెందుకీ తాపత్రయం, కాశీయో రామేశ్వరమో పోనూ.'

'సరేలే చూద్దాం, యిప్పుడేం తొందర'

'అయ్యో తొందరేమిటి కొంపలు మునిగి పోతూంటేను...'

'ఏం'

'ఏం ఏమిటి' అని కొంచెం అటుయిటు చూసి, 'గోడలకు చెవులుంటాయి. లోకయ్య సామాన్యుడా. ఆ వెంకాయమ్మ చెవిలో కాస్త ఊదాడంటే, కొంపలు అంటుకోవడంకన్న యింకేమన్నా ఉందా. అదిగాక శారదాబిల్లులాంటి బిల్లు యింకోకటేదో వచ్చిందట. గాడిదల్లాగ 18 ఏండ్లొచ్చేదాకా పెళ్లిళ్లు చెయ్యకూడదట ఆడపిల్లలకి' అంటూ చెవులుమూసుకొని 'రాధాస్వామి' 'రాధాస్వామి' అనుకొంది.

'సుబ్బమ్మక్కా నువ్వు అసాధ్యురాలివి. ఈ మట్టిబుర్రకి యిది తట్టనే లేదుసుమా.'

'ఎంతబుర్రలకి మాత్రం అన్నీ తట్టి చస్తాయా. ఇంతకీ ఆ రాధాస్వామి దయ.'

సుబ్బమ్మ సామాన్యురాలు కాదనే విషయం రామప్పంతులుకు తెలుసు. రామప్పంతుల్ని వదలుకొంటే ఈ వ్యవహారంలో తన కేమీ మిగలదని సుబ్బమ్మకు తెలుసు. కాని వీళ్ళిద్దర్నీ కబళించగల సమర్థుడు లోకాభిరామయ్య అనేసంగతి వీళ్ళిద్దరి అంతర్యాలకూ తెలిసినా, వాళ్లు తెలుసుకోవడానికి యిష్టపడలేదు గాబట్టి తెలసికోలేదు.

సుబ్బమ్మ యింటిదగ్గర్నుంచి బయలుదేరిన లోకయ్య నికానీదారు వెంకాయమ్మ దగ్గర్నుంచి ప్రామిసరీనోట్లు తీసుకొన్నాడు. ఈ సంగతి వెంకాయమ్మదగ్గరకెళ్ళిన రామప్పంతులుకు తెలియగానే 'ఇంకేముంది నీచేతులారా కొంపతీసుకున్నావు' అన్నాడు పంతులు.

'అవేవో కాగితాలకి డబ్బొస్తుందంటే లోకయ్య కిచ్చా'నన్నది వెంకాయమ్మ.

'మీకు తెలియదు, ఏడవకు — యిప్పుడెట్లా' అన్న రామప్పంతులుకు మెరపులాంటి ఆలోచన తోచింది.

'అయితే లక్ష్మిని నావెంట పంపించు. ఆ లోకయ్యదగ్గరకెళ్ళి ఆ కాగితాలు కరామతులు తీసుకువస్తా. మళ్లా ఎవరన్నా ఏమన్నా అడిగితే యిచ్చేవు ఏమన్నా కొంప తీసి' అంటూ లక్ష్మిని తీసుకెళ్లాడు.

రామప్పంతులి వెంట లక్ష్మిని చూడగానే అనుకున్నాడు లోకయ్య 'ఇదా సంగతి' అని.

> విమానం అంతవరకూ బాగానే నడుపుతున్న పైలట్ చాలా ఎత్తుకు ఎగిరాక ఉన్నట్టుండి వికటాట్టహాసం చేయసాగాడు. ప్రయాణీకులు "ఏమిటలా నవ్వుతున్నా"వని అడిగారు.
>
> "ఏమీ లేదు. నేను పారిపోయానని తెలిస్తే మా పిచ్చాసుపత్రి సూపర్నెంటు ఉద్యోగం పోతుందని ఎంత బెంగపడిపోతాడోనని నవ్వుకుంటున్నాను," అన్నాడు పైలట్.

'ఏం పంతులూ, వెంట సీతయ్యకూతుర్ని గూడా తీసుకువచ్చావేం?'

'ఎట్లాగైనా మనతో ఉండవలసినదేగా.'

'ఆ బహువచన ప్రయోగం దేనికంట?'

'చాల్లేగాని, నేను వచ్చిన పనివేరు. ఆ కాగితాలూ అవీ ఉన్నాయే' అని లక్ష్మివైపు తిరిగి 'చెప్పవేం మీ అమ్మ నాకు యిమ్మనలేదూ...' అన్నాడు.

'అవును, అవును. మరెవ్వరు కాజెయ్యకుండా మా అమ్మే...మరే...'

'సరే చాలు ఆపుచెయ్యి' అని సంజ్ఞ చేశాడు రామప్పంతులు.

'ఆ కాగితాలతో నాకు వేరే పనుందిలే వాట్లని ప్రామిసరీ నోట్లంటారు'

'అంటారేమిటి? నాకు తెలియదు గనకనా. అందుకనే వాట్లని యిట్లా తెమ్మంటున్నాను.'

తెగటంలేదు. ముడిపడటంలేదు. అందువల్ల రామప్పంతులు లోకయ్యను పక్కకు తీసుకుపోయి చెవిలో ఏదో చెప్పాడు. ఇద్దరికీ ఘర్షణ ప్రారంభమైంది. లోకాభిరామయ్యను గబగబా రామయ్యపంతుల్ని రెక్కపట్టుకు తీసుకొచ్చి—

'ఏం అమ్మాయీ నిన్ను వీడికిచ్చిపెళ్లి చేస్తానన్నాడా మీ అమ్మ' అని పూర్తిచెయ్యకుండానే—

'అది కాదు, అదికాదు. దానికేం తెలుసు పర్రకుంకకి...అయినా ఆమాటా ఈమాటా చెప్పి ఆ నోట్ల డబ్బు కాజెయ్యడానికా.

సీతయ్య బ్రతికున్నన్నాళ్లు అటూ యిటూ మింగి యీ కొడికి తెచ్చారు సంసారాన్ని.'

'ఏకూతపడితే అకూత గయ్యాడమే. పద నీపనిబడతా' అని లోకయ్య అంటే—

'పద... నేనేం పోగేసుకోవడం లేదు' అంటూ రుస రుస సాగారు యిద్దరూ వెంకాయమ్మయింటికి.'

ఎందుకైనా మంచిదని ఒకళ్లిద్దరు మోతుబరి రైతుల్ని వెంటబెట్టుకొని వచ్చాడు లోకయ్య.

'ఏమిటి వెంకాయమ్మా సంగతి నీ కూతుర్ని ఆస్తితో సహా ఈ రామప్పంతులికి కట్టబెడుతున్నావా' అన్నాడు ఒక్క గుక్కలో లోకాభిరామయ్య

'అయ్యో - యిదేం ఖర్మం. దానికి పట్టుమని పదేళ్ళయినా నిండందే. అయినా నీ కడుపుచల్లగా, రామప్పంతులు చేసుకుంటానన్నాడా'

రామప్పంతులు ఆశగా చూశాడు వెంకాయమ్మ కళ్లల్లోకి.

'ఏదో ఎదురుగుండా ఒక నిండు సంసారం నీటకలసిపోతూంటే చూస్తూ ఊరుకోలేక...' అన్నాడు రామప్పంతులు.

'ఓసి నీఖర్మంగాల. ఆ రామప్పంతులు చేసుకుంటానన్నా, నువ్వు యిస్తానన్నా ఈ లోకాభిరామయ్య బ్రతికుండగా ఆ పిల్లదాని గొంతు కోస్తానంటే ఊరుకోనంటే ఊరుకోను,' అంటూ ప్రక్కనున్న పెద్దమనుష్యులవైపు తిరిగాడు మద్దతుకు వాళ్ళు 'సై' అంటే 'సై' అన్నారు. అది ఒక చిన్న నాటకపు స్టేజీలాగ తయారైంది.

'అయినా ఏమిటో ఈ బెదరింపు' అంటూ వెంకాయమ్మవైపు తిరిగాడు రామప్పంతులు.

అటూ యిటూ తోచక బిక్కముఖమేసిన వెంకాయమ్మ కేసి చూసి లోకాభిరామయ్య అన్నాడు.

'ఇదిగో చూడు...ఆ బోషాణపు తాళం చేతులు యిలా యియ్యి.'

'ఏం'

'అందులో రూపాయలు కూడా స్వాహా కాకముందే'

'అవి విక్టోరియా రూపాయలు, మారవటగా. మారుస్తానని సుబ్బమ్మ కక్క తీసుకెళ్లింది, ఇందాకనే.'

'కొంప ముంచేశావు వెంకాయమ్మా' అని లోకయ్య మొత్తుకుంటూంటే, రామప్పంతులు మెల్లగా జారుకోవడం చూశారు అక్కడి పెద్దమనుషులు.

'అకేమిటయ్యా, మన తెలివి మండినట్లుంది. పంతులేడయ్యా' అన్నదే తడవుగా అందరూ సుబ్బమ్మయింటికి ఎగబడ్డారు.

అప్పుడే సత్కారాలు గైకొన్న రామప్పంతులు మహోత్సాహంగా విక్టోరియా రూపాయలసంగతి మాట్లాడుతున్నాడు. ఇంతలోకే యములాళ్లలాగ తయారయిన లోకాభిరామయ్య వాళ్ళని చూసేటప్పటికి నిజంగా ప్రాణం పోయినట్లనిపించింది. కొంచెం బిగదీసుకొని 'ఏం ఇక్కడకు గూడా...'

అవును...మీ ఇద్దర్నీ'

'ఆ ఏమన్నావు. నా పేరెందుకు తీస్తావు. ఆ గోలతో నాకేం సంబంధం' అంటూ 'రాధాస్వామి, రాధాస్వామి' అని పెరట్లోకి వెళ్ళబోతోంది.

'ఏయ్ సుబ్బమ్మా'

'కొంచెం మర్యాదతో ఏడుద్దూ లోకయ్యా'

'నీకు మర్యాదేమిటి దగాకోరుదానికి. ఆ విక్టోరియా రూపాయలన్నావే అవి...'

'రూపాయలేమిటి, రాధాస్వామి తోడుగా నాకేమీ తెలియక'

'ఆ రాధాస్వామిగూడా దీనికి ఈ అఘాయిత్యానికి తోడు. మర్యాదగా యిస్తావా లేక...' అంటూ వెంటవచ్చిన పెద్దమనుష్యులతో అన్నాడు–'యీ రామప్పంతుల్ని ఎక్కడకూ వెళ్ళకుండా చూడండి.'

'సరే నాకేం సంబంధం ఈ వ్యవహారంతో, మీరే పులుముకోండి' అని తప్పించుకొని పోబోతుంటే

'అబ్బే అట్లాఅంటే ఎట్లా, ఉన్నదంతా నీతోనే ఉంది. ఈ రంగం నువ్వులేకుండా అంటే పెళ్ళికొడుకు లేకుండా...'

'మాకెందుకు ఈగోల' అని ఒక్క కంఠముతో రామప్పంతులు, సుబ్బమ్మ అన్నారు.

'సరే మీరు వీళ్ళని కనిపెట్టి ఉండండి. లోపలికి వెళ్ళి విక్టోరియా రూపాయల సంగతి నే చూస్తా' అని లోకయ్య రూపాయల సంచులు బయటకు తెచ్చాడు.

'అరే, అప్పుడే మార్చేశావే, కొన్ని కరెన్సీనోట్ల క్రింద, మరికొన్ని మంచిరూపాయల క్రిందా. అయినా సీతయ్య తెలివి తక్కువవాడైనా నువ్వు చాలా తెలివిగలపని చేశావు ఎట్లాగైనా నీబుద్ధి సుబ్బమ్మా!'

ఇంతలోకే వెంకాయమ్మ గోజుకుంటూ వచ్చింది 'నాసంసారం నట్టేట్లో కలిసిందిరో' అంటూ.

'అవును. రామప్పంతులు అల్లుడు ఐతే యింకేం కావాలి. మొన్ననేగా 54 దాటి 55 లేక 53 దాటి 54...అంతేగా...ఐనా నీ విక్టోరియా రూపాయలు సుబ్బమ్మ మార్చివేసిందాయె'

'మరింకెందుకు, మనవాళ్ళని శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించేటట్లు చేయడం ఒక్కటే తరువాయన్నమాట' అన్నాడొక పెద్దమనిషి.

'అందుకు సందేహమా' అన్న యింకొకరితో మిగతావాళ్లు ఏకీభవించారు.

కాని లోకయ్యమాత్రం లోకాభిరామయ్య అనిపించుకునేటట్లు యిద్దర్నీ తగురీతిగా సత్కరించి పంపేశాడు.

'కొంచెం ఒళ్లు దగ్గరుంచుకొని ప్రవర్తించు వెంకాయమ్మా. మిగతా సంగతులు నేను చూస్తా. ఈ పెద్దమనుషులు చూస్తారు. నీడబ్బు చిల్లిగవ్వ నాకక్కర్లేదు. నేను లోకాభిరామయ్యను తెలుసా' అంటూంటే సుబ్బమ్మ 'రాధాస్వామి, రాధాస్వామి' అంటూ వడిగా జపిస్తోంది. ★

---

హంగేరియన్ కవి శాండర్ పెటోఫీ ఎప్పుడూ దారిద్ర్యంతో బాధపడుతూ ఉండేవాడు. ఒకసారి అతడొక నది దాటవలసివచ్చింది. పడవవాడి కివ్వడానికి చేతిలో పైసా లేదు. నెమ్మదిగా వాణ్ణి ఇవతలికి పిలిచి, ఇలా అన్నాడు.

"నన్ను దాటించావంటే నీకు ఒక రహస్యం చెబుతాను. దాంతో నువ్వు ధనవంతుడి వవుతావు."

పడవవాడు సరేనని డబ్బు తీసుకోకుండానే కవిని అవతలి ఒడ్డుకి తీసుకువెళ్లాడు. పడవ దిగి కవి రహస్యం చెప్పేశాడు పడవవాడికి: "ఇకనుంచీ నన్ను గాని, ఇతరుల్ని గాని డబ్బు పుచ్చుకోకుండా ఇలా నది దాటించకు. దాటించావో, నీ దరిద్రం ఎన్నటికీ వదలదు," అని తనదారిని తాను చక్కా పోయాడు.

---




# వైజ్ఞానిక రంగములో తల్లీ, కూతుళ్లు

ప్రపంచములో నూటికో కోటికో ఒక మహావ్యక్తి జన్మిస్తాడు. కుటుంబములో ఏ ఒక్కరో కీర్తి గడించి తమ పేరు చిరస్థాయిగా నిలుపుకోగలుగుతారు. లోకములో తండ్రీకొడుకులుగానీ, తల్లికూతుళ్లుగానీ ఇద్దరూ గొప్ప వ్యక్తిత్వము కలవారయి ఉండటము అసాధారణము. ఈ అసాధారణమైన కలయికలలో భార్యాభర్తల సమాన ప్రతిభకూడా ఒకటి. దీనిలోకూడా ఒక శాస్త్రములోనే, ఈ జంటలు ప్రతిభను సంపాదించటము అరుదు.



స్క్లాడోస్కా భౌతిక గణిత శాస్త్రోపాధ్యాయుడు. ఈయన కుమార్తె మేరీ సుప్రసిద్ధ వైజ్ఞానికురాలు. ప్యారిస్‌కు చెందిన సార్బోను విశ్వవిద్యాలయములో పియర్ క్యూరీ ఫిజిక్సు ప్రొఫెసరుగా పనిచేసేవాడు. పోలెండు దేశములో జన్మించి, అక్కడే విద్యాభ్యాసము ముగించుకొన్న మేరీ, కారణాంతరాలచే ప్రొఫెసరు క్యూరీ వద్ద పరిశోధకురాలిగా, సహాయకురాలుగా ప్రవేశించింది. మేరీ వచ్చిన కాలములో పియర్ క్యూరీ విద్యుత్సంబంధమైన పరిశోధనలను లోహముయొక్క అయస్కాంతీయ గుణములపై పరిశోధనలు చేస్తూ ఉండేవాడు. విజ్ఞానవిద్యపై అమితమైన అభిలాషగల మేరీ, పియర్ కి శిష్యురాలివలె కృషిచేయ నారంభించింది. వారిమధ్య పరిచయము క్రమముగా అనురాగముగా మారి ప్రేయసీ ప్రియులయినారు; ఒక శుభముహూర్తమున దంపతు లయినారు. వీరిద్దరూ కలిసి పరిశోధనలు సాగించారు. తత్ఫలితముగా రేడియో ధార్మిక మూలపదార్థాలు రేడియం, పొలోనియమ్ అనేవాటని నూతనముగా కనిపెట్టారు. మేరీ జన్మదేశమైన పోలెండు జ్ఞాపకార్థము 'పొలోనియమ్' అన్నది పిలువబడుతున్నది. 1903 సంవత్సరపు నోబెలు బహుమానము బెకరల్, పియర్ క్యూరీ, మేరీ క్యూరీలకు ముగ్గురికీ విజ్ఞానశాస్త్రములో లభించింది. ఈ ముగ్గురూ ఆ బహుమానాన్ని పంచుకొన్నారు.

1906 లో పెనిమిటి చనిపోయిన తరువాత, ఆయన స్థానే మేరీక్యూరీ ప్రొఫెసరుగా ఎన్నుకొనబడ్డది. ఆమె శాస్త్ర పరిశోధనలు నిర్విరామముగా సాగించి, రేడియమ్ ధాతువును ఇతర పదార్థాలనుండి వేరుచేసి, పరిశుభ్రస్థితిలో విడదీసింది. దీనికి తిరిగి మరొకసారి 1911 లో, రసాయన పరిశోధనకై ఆమెకు నోబుల్ బహుమానము లభించింది. ఈమె రేడియం కనిపెట్టిన తరువాత, శాస్త్ర పరిశోధనలో కలిగిన సంచలనమూ ప్రాముఖ్యమూ అపారము. మేడమ్ క్యూరీ రేడియమ్ వుమన్‌గా ప్రఖ్యాతి చెందినది. నాగరక దేశాలూ, విశ్వవిద్యాలయాలూ ఆమెను గౌరవించి సన్మానించాయి. ఆమె గౌరవార్థము రేడియమ్ యొక్క ఒక యూనిట్

ఇల్లిందల సరస్వతీదేవి

పేరు 'క్యూరీ' అని పెట్టబడ్డది. దాని విభాగాలు 'మిలీ క్యూరీ,' 'మైక్రో క్యూరీ' అని పేర్కొనబడుతున్నాయి. రెండు పర్యాయములు నోబెల్ బహుమానమును పొందగలిగిన గౌరవమూ, భార్యాభర్తలకు నోబెల్ బహుమానము పొందిన అనుభూతీ ఆమెకే లభించింది.

క్యూరీ దంపతుల కూరిమి పుత్రిక ఐరీన్ 1897 లో జన్మించింది. ఈమె క్రమముగా విద్యాభ్యాసాన్ని ముగించుకొని, తన పితరులకు అభిమాన విషయమైన శాస్త్ర పరిశోధనకు పూనుకొన్నది. తల్లి పరిశోధన శాలలో సహాయకారిణిగా ప్రవేశించింది. ఆ పరిశోధనాలయములోనే మరొక సహాయకుడుగా ఫ్రెడరిక్ జోలియో ప్రవేశించాడు. ఈ యువతీ యువకులకు వెనుకటి జంటగాలి సోకి, ప్రేయసీ ప్రియులైనారు. వీరిద్దరూ వివాహము చేసుకొన్నారు. భార్యాభర్తలయిన తరువాత, వారికి విజ్ఞాన విషయికముగా ఉత్సాహమూ, అభిమానమూ ఇనుమడించాయి. ఇద్దరూ ఉమ్మడిగా రసాయనిక పరిశోధనలు సాగించారు. ఈ విషయములో కూడా వీరిద్దరికీ వెనుకటి జంటగాలి సోకింది.

1932 లో తల్లి స్థానమున ఐరిన్ క్యూరీ ప్రొఫెసరుగా నియుక్తురాలయినది. ఈ జంటకు కూడా 1935 లో పరిశోధనాలయములో రేడియో ధర్మము కలిగిన ధాతువులను తయారు చేసినందులకై-రసాయన శాస్త్రపు నోబెల్ బహుమానము లభించింది. ఈ దంపతులిద్దరూ నాటినుండీ పరిశోధనలు సాగిస్తూ వచ్చారు. తనకు మార్గదర్శిని-శ్వశుర అయిన మేరీ క్యూరీ గౌరవార్థముగా ఫ్రెడరిక్ జోలియో తన పేరుతోపాటుగా ఆమె యింటిపేరు కూడా చేర్చుకొని 'ఫ్రెడరిక్ జోలియో క్యూరీ' అయినాడు. మేడమ్ ఐరీన్ జోలియో క్యూరీ శాస్త్రోపాధ్యాయుగా పని చేయటమే కాకుండా, విజ్ఞాన పరిశోధనాశాఖలో ఉప కార్యదర్శినిగా, పరమాణుశక్తి సంఘములోనూ, శాస్త్రజ్ఞుల సంఘాలలోనూ ప్రసిద్ధ పాత్రను వహించింది.

ప్రపంచంలో పండితులూ విజ్ఞానవేత్తలూ అరుదుగా ఉంటారు. కష్టసాధ్యమయిన వైజ్ఞానిక పరిశోధనలో లోక విఖ్యాతి నార్జించిన ఈ తల్లీ కూతుళ్ళు మేడమ్ మేరీ క్యూరీ స్త్రీ జాతిలో మణిదీపాలవంటివారు. భోజరాజకాలములో కవులకేగాని ఇతరులకు రాజదర్శనము లభించేది కాదట. ఆ రాజదర్శనానికి వెళ్ళిన ఒక కుటుంబము ఆయన ఇచ్చిన "క్రియా సిద్ధిస్సత్వే భవతి మహంతాంనోపకరణే" అన్న సమస్యను భార్యాభర్తలూ వారి కొడుకూ కోడలూ నలుగురూ నాలుగు విధాలుగా సమర్థవంతముగా పూరించారు. వారందరిలో కోడలి సమస్యాపూరణము అత్యుత్తమమైన దని భోజరాజు నిర్ణయించాడనీ వారందరినీ యథోచితముగా గౌరవించి సన్మానించాడనీ ఐతిహ్యము ప్రచారములో ఉన్నది. క్యూరీ కుటుంబములో భార్యాభర్తలూ, వారికుమార్తె అల్లుడూ - నలుగురూ విజ్ఞాన శాస్త్ర పరిశోధనలో ప్రపంచ విఖ్యాతిని ఆర్జించి నోబెల్ బహుమానము పొందారు. ఈ నలుగురిలో ఇద్దరు స్త్రీలు ఉండటము స్త్రీ జాతికి గర్వకారణము. కీర్తి నార్జించటములోనూ, ప్రపంచ ప్రఖ్యాతిగాంచటములోనూ, నోబెల్ బహుమానము నందుకోవటములోనూ తల్లితో సమాన ప్రజ్ఞగల మేడమ్ ఐరిన్ జోరియో క్యూరీ ఈ మార్చి 17 వ తేదీన భౌతిక దేహము చాలించింది.

శాస్త్రజ్ఞులు ఇంతవరకూ పరిశోధనచేసి కనిపెట్టిన వాటిలో రేడియం చాలా ముఖ్యమైనది. ఇది సదా నులివెచ్చనైన వేడిమిని ప్రసరింపజేస్తూ ఉంటుంది. ఇది గాఢమైన విషపదార్థము. దూరమునుండికూడా, దీనిలో ఉన్న విషము చెడుపుచేయగలిగినంతటి శక్తి వంతమైనది. దీనిని చర్మానికి దగ్గరగా ఉంచినట్లయితే తీవ్రమైన వ్రణాలు బయలుదేరుతాయని ప్రయోగమువల్ల తేలినది. రేడియమ్ చికిత్సలకు అతిముఖ్యముగా వాడబడుతున్నది. రేడియంకిరణాలు ఎక్స్ కిరణాల వలెనే మిక్కిలిసూటిగా చొరబడు స్వభావము కలవి. ఇవి శరీరములో ప్రవేశించినట్లయిన కొన్ని విధములయిన తంతుకోశాలను నాశనము చేయగలవు. మానవదేహములో సూక్ష్మ కోశాలలో జనించే పుట్టకురుపు, పులిపిరికాయలు మొటిమలు చర్మవ్యాధులు మొదలైన వాటిని రేడియమ్ కిరణాలు అంత మొందించ గలవు. రేడియమ్ యొక్క గామాకిరణాలు శరీరమున దుర్మాంసము పెరుగకుండ నివారిస్తుంది. టాన్సిల్సు పెరుగుదలను రేడియమ్‌తో నివారించటానికి ప్రయత్నాలు జరిగాయి.

రేడియమ్ యొక్క ఉపయోగము వైద్యవిషయికముగానే కాకుండా పారిశ్రామికముగా కూడా అపారమైనది. కొన్ని వస్తువులకు పూసే రంగులు స్వయంప్రకాశములుగా ఉండటానికి రేడియమ్ ఉపయోగపడుతున్నది. గడియారాలకు ఫౌంటెన్‌కలాలకు విమానాలకు, చీకటిలో కూడా కనబడటానికిగాను అతికించబడే బిళ్ళలకు మొదలైన వాటి కొన్నిటికో ఇది ఉపయోగపడుతున్నది. ఇటీవల రేడియమ్ కిరణాల ప్రసరణతో నవరత్నాల కాంతిని ఇనుమడింపచేయటానికి ప్రయత్నాలుజరుగుతున్నాయి. రేడియమ్ విత్తనాలను నిష్క్రిమిగా చేయగలదు. సూక్ష్మజీవులను నాశనము చేయగలదు. దీని ఉపయోగము శాస్త్రజ్ఞులు పరిశోధనచేసిన కొద్దీ అధికమయిపోతున్నది. ఆధునిక విజ్ఞానానికి మూలకారణమనతగిన ఈ దివ్యపదార్థాన్ని ఒక స్త్రీ కనిపెటగలగటము అత్యద్భుత విషయము. ఈ పుణ్యశాలిని కన్నకుమార్తె, పరమాణుశక్తిని తెలిసికోవటానికి ఉపయోగపడే రేడియోధర్మము కలిగిన ధాతువులను తయారుచేయ గలిగింది. వైజ్ఞానిక రంగములో అఖండకీర్తి నార్జించిన ఈ మాతాదుహితలు చిరస్మరణీయులు — అమరజీవులు. ★

ఇంగ్లీషువాడొకడు అమెరికా చూడడానికి వెళ్లాడు. ఒక అమెరికన్ మిత్రునితో హేళనగా ఇలా గన్నాడు: "మీ దేశంలో విడాకులసంఖ్య ఇంతగా పెరిగిపోవడం చూస్తే, మీలో 'స్వాతంత్ర్యపిపాస అధికమనిపిస్తోంది."

"అవునవును. కాని ఒక సంగతి చూశారో లేదో, వివాహాల సంఖ్య కూడా దానితో పాటు పెరుగుతూనే ఉంది. దాన్నిబట్టిచూస్తే ధైర్యసాహసాలు కూడా మాకు ఎక్కువే నని మీరు ఒప్పుకోవాలి," అన్నాడు అమెరికన్.

బాలసాహితి:

# శర్మజోస్యం

ఒక చిన్న పల్లెటూరిలో కామయ్య శర్మ అను పేరుగల ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన అద్భుతంగా జోస్యం చెప్పేవాడని ఆ చుట్టుప్రక్కల పల్లెలలో ప్రతీతి. అనుదినం పల్లెలనుండి తమ సందేహాలను బాపుకోవడంకోసం పల్లె ప్రజలు ఆయనను దర్శించుచుండేవారు. వారిలో ముఖ్యంగా వివాహాదులకు సంబంధించిన ప్రశ్న లడిగేవారు, పశువులు పోయినవారు, ఏదైన సొత్తు పోగొట్టుకొన్నవారు ఎక్కువగా ఉండేవారు. ప్రశ్నకు ఎనిమిదణాలు ఖచ్చితంగా వసూలు చేసేవాడు.

ఇలా ఉండగా ఒక రోజున ఆ ఊరిప్రక్క గ్రామంలో నివసించు 'సుబ్బన్న' అను పేరుగల ఒక చాకలివాని గాడిద ఒకటి కనిపించకుండాపోయింది. చాకలివాడు చుట్టుప్రక్కల ఉండే గ్రామములు, పొలములు, బీళ్లు అన్నీ తిరిగేడు. కనుపించలేదు. శర్మగారివద్ద ప్రశ్న అడగమని బంధువర్గమువారుసలహా యిచ్చారు. కాని ఆ నిరుపేద సుబ్బన్నకు ప్రశ్నకు యిచ్చుకోవడానికి ఎనిమిది అణాలు లేవు. ఇంటిలో వెదుకగా చిలుముపట్టియున్న పావులాబిళ్ళ ఒకటి గూటిలో దొరికింది. అది పుచ్చుకొని శర్మగారి దర్శనం చేసికొని విషయం విన్నవించుకొన్నాడు.

శర్మగారు గ్రుడ్లురిమి "ఎనిమిది అణాలకు దమ్మిడీ తక్కువైనా చెప్పేది లేదు వెల్లిపో" అన్నాడు.

"బీదవాణ్ణి, కనికరించు సామీ! ఈ పావులా పుచ్చుకొని ప్రశ్న చెప్పండి" అని జాలిగా ప్రార్థించేడు పాపం గాడిదను పోగొట్టుకున్న పేదచాకలి సుబ్బన్న.

"ఏం ఉపయోగంలేదు! వెల్లిపో, అవతలికి!" అని మిగతా కేసులు చూసుకోవడంలో నిమగ్నుడైనాడు కామయ్య శర్మ.

సుబ్బన్న తలదించేసుకొని మెల్లిగా కొంప చేరుకున్నాడు. ముప్పయి రూపాయల గాడిదను చేతులారా ఎలా వదులుకోడం. సుబ్బన్న బాగా ఆలోచించి మూల నుండే కుండలోనున్న జొన్నలు మానెడు ఒక పావులాకు అమ్మి మొత్తం ఏనిమిదణాలతో తిరిగి శర్మగారి దర్శనం చేసుకొన్నాడు.

"మీ ఊరికి సరిగా ఈశాన్య మూల పన్నెండు మైళ్ళ దూరాన వుండే గ్రామములో బందెలదొడ్లో నీ గాడిద ఉన్నది. వెళ్ళి తోలుకొచ్చుకో" అని చూచినట్లుగా చెప్పేడు శర్మ.

సుబ్బన్న ఆనందంతో ఇంటి వద్దకు వచ్చేసరికి పాకలో గాడిద కట్టివేసి ఉన్నది. "అరె! ఇదేమిటి, గాడిద వచ్చేసిందే!" అని సుబ్బన్న ఆశ్చర్యపోతూవుంటే "చాకిరేవుదగ్గరుంటే తోలుకొచ్చా"నని వాని భార్య చెప్పింది. "మరి...అయ్యోరు అలా సెప్పేరేం!" అని ముక్కుమీద వేలేసుకొని అలానే కాసేపు నిలువబడిపోయాడు సుబ్బన్న, ఆ క్షణంలో సుబ్బన్న మెదడులో ఏం ఊహాలు పొడకట్టినాయో గాని— "ఓస్! అంతా బూటకంరా!" అని గట్టిగా అరిచేడు. వెంటనే ఎనిమిదణాల ఫీజువిషయం జ్ఞప్తికొచ్చింది. పేద సుబ్బన్న కడుపు దహించుకపోయింది. "వృథాగా చేతిలోని పైకం ఆయనవాతకొట్టేను" అంటూ దిగులుగా కూర్చున్నాడు క్రింద. వానిలో ప్రతీకారవాంఛ రేకెత్తడం మొదలుపెట్టింది.

అర్థరాత్రి సమయం. నలుమూలల చిమ్మచీకటి ఆవరించిఉంది. చాకలి సుబ్బన్న శర్మగారి దొడ్డివాకిలి తెరచి పాకలో ప్రవేశించాడు.

ఆవు గడ్డి నములుతూ వుంది.

వి. వెంకటేశ్వర రెడ్డి

ప్రక్కనే నేలపై చాపవేసికొని శర్మగారి సేవకుడు చెవిటి పుల్లయ్య గుర్రుపెట్టి నిద్రపోతూ ఉన్నాడు. సుబ్బన్న ఆవు పలుపు విప్పి చేత పుచ్చుకొని బయటికి నడిచేడు. ఒక నిముషంలో తిరిగి లోనికి వచ్చి చెవిటి పుల్లయ్యను జాగ్రత్తగా చాపతోపాటు ఎత్తి ఆవు ఉన్న స్థానంలో ఉంచేడు. తాటితో గాటిగుంజకు దాని మెడకు కట్టివేసి మెల్లిగా వచ్చిన దారినే వెళ్లిపోయాడు.

తెల్లవారుతూ ఉన్నే శర్మ నిద్ర నుండి లేచి అలవాటు ప్రకారం "పుల్లిగా!" అంటూ వాడిని నిద్ర లేపడంకోసరం పాకలోకి వచ్చాడు. చీకటిలో బాగా కనుపించలేదు. బయటికి వెళ్ళేడేమోనని అనుకొని దంటు పుచ్చుకొని ఆవుని అదలించాడు. "ఊఁ" అంటూ ముసుగు దన్ని పడుండిఉన్న పుల్లయ్య అటు నుండి యిటు పొర్లేడు. శర్మగారి గుండె గభేలుమన్నది.

"ఇక్కడ పడుకున్నావేంరా వెధవా! ఆవేది?"

"ఆఁ" అంటూ మళ్ళీ పొర్లేడు.

"ఆఁ ఊఁ ఏమిట్రా గాడిదీ! ఆవు ఏలా పోయిందీ? లేయ్!" అంటూ దంటుతో ఒకటి పీకేసరికి లేవబోయాడు. మెడకు తగిలించిన తాడు బిగిసిపోయింది. "అమ్మ య్యో!" అని అరిచేడు.

"ఇదేమిట్రా గాడిదీ! గుంజకు కట్టేసిం దెవరు?" అంటూ అది విప్పి—"ఆవు ఎలా పోయిందీ?—ఇదంతా ఏమిటి?" అని గట్టిగా అరిచేడు శర్మ.

"ఆవేదీ?" అంటూ అప్పుడు అటూ యిటూ చూడ్డం మొదలు పెట్టేడు వెర్రిపుల్లయ్య.

"ఇంకా ఆవేమిటిరా గాడిదీ! మోసం జరిగిపోయింది. దొంగలు తోలుకొని పోయారల్లే ఉంది!" అన్నాడు శర్మ.

"అమ్మో దొంగలా!" అంటూ అటూ యిటూ పరుగెత్తడం ప్రారంభించేడు పుల్లయ్య.

"నీ మొఖం! దొంగలిప్పు డెక్కడుంటార్రా వెధవా! ఆవును తోలుకొని వెళ్ళిపోయారు!" అన్నాడు దిగులుగా. ఇంతలో శర్మగారి భార్యకూడా లేచివచ్చింది. విషయమంతా విని- "అయితే ప్రశ్న వేసి చూడండి! ఎవరు తోలుకెళ్ళారో తెలిసిపోతుంది! మన చేతిలో పని! దిగులుపడ్డం దేనికి?" అంది.

"ప్రశ్నా, నా మొఖం!...ఎవడో బాగా కనిపెట్టి పనిచేసేశాడు!" అంటూ తలపట్టుకొని కూచున్నాడు.

మరునాటినుండి శర్మ ప్రశ్నలు చెప్పడం బొత్తిగా మానివేసి వ్యవసాయం వృత్తిగా ప్రారంభించాడు. ఎవరైనా ప్రశ్నకు వస్తే—"దానికి సంబంధించిన తాటియాకుల గ్రంథాన్ని ఎవరో దొంగవెధవ లపహరించివేశారండీ! అందుచేత అది మానుకున్నాను" అని సమాధానం చెప్పి పంపించేవాడు.



# ఉత్తమాశ్వం

అరేబియా దేశమును ఖలీఫా పరిపాలించు రోజులవి. ఆ మహారాజునకు అశ్వము లనిన మహాప్రీతి. ఎంతెంతో ఖరీదు పెట్టి ఎన్నెన్నో ఉత్తమాశ్వములను అనేక దేశములనుండి తెప్పించు చుండెడివాడు. ఒకనాడు అబ్దుల్ కరీముఅను అశ్వవర్తకుడు వచ్చెను. రాజు వచ్చిన కారణమేమని అడిగెను. "నా పేరు అబ్దుల్ కరీము. నేను గుఱ్ఱాల వర్తకుడను. ఒక చక్కటి అరేబియా గుఱ్ఱమును తెచ్చితిని. దానితో వేగముగా బోవు గుఱ్ఱములు అరేబియాలో లేవు. ఈ గుఱ్ఱమును మీరు కొందురను ఉద్దేశ్యముతో వచ్చితిని. ఆపైన మీ అనుగ్రహము" అని చెప్పెను.

ఖలీఫా దాని వెంత కిచ్చెదవని అడిగెను. "తమరు దయాళువులు. ఆ గుఱ్ఱము లక్ష రూప్యములు చేస్తుంది హుజూర్" అనెను. ఖలీఫా సందేహిస్తూ "మే మింతవఱకూ ఏ గుఱ్ఱానికి 50 వేలు మించిపెట్టలేదు. ఎంత ఉత్తమాశ్వమైనా లక్ష రూప్యములు ఖరీదు చేస్తుందంటే చాలా ఆశ్చర్యముగా నున్న"దని చెప్పెను. ఖలీఫాకు ఆ గుఱ్ఱమునకు లక్ష రూపాయలు ఇచ్చుటకు మనసొప్పలేదు. అయినా అంతటి చక్కటి గుఱ్ఱమును వదిలిపెట్ట బుద్ధి పుట్టక చివరకు గొణుగుతూ అబ్దుల్ కరీముకు లక్ష రూపాయల మూట ఇచ్చాడు. వర్తకుడు అది అందుకొని ఒక్క దూకున గుఱ్ఱముమీద కెగిరి కళ్లెము పట్టుకొని లాగుటయే తడవుగా గుఱ్ఱము అతివేగముగా పోసాగెను. ఖలీఫా కోపాశ్చర్యములతో నిండి తన 10 మంది పేరెక్కిన రౌతులను పిలిచి కరీమును వెంబడించమని చెప్పెను. ఆ రౌతులు ఒక గంటతరువాత వచ్చి "హుజూర్ మే మెంత ప్రయత్నించినా ఆగుఱ్ఱపు దొంగ దొరకలేదు. పైగా ఒక్క నిమిషంలో అడవులలో మాయమయినాడు" అన్నారు విచారంగా. ఖలీఫా మిక్కుటమగు కోపముతో కొడలిపోయెను. ఆమరునాడు రాజు దర్శనముకొఱకు ఎవరో వచ్చిరి. ద్వారపాలకుడు రాజుతో ఈ విషయము విన్నవించెను. ప్రొద్దున్నే ఎవరు వచ్చిరి చెప్మా అని ఆలోచిస్తూ బయటికి వచ్చాడు ఖలీఫా. అక్కడి దృశ్యాన్ని చూసేసరికి రాజుకు అమితాశ్చర్యం వేసింది. "నిన్న వచ్చిన అబ్దుల్ కరీము సుందరాశ్వముపై కూర్చొని ఒక చేతిలో లక్ష రూపాయల మూట పట్టుకొని యుండుట" ఖలీఫా చూచెను. ఖలీఫాను చూడగనే కరీము ఆతనికి సలాముపెట్టి "హుజూర్, ఇప్పటికైనా గ్రహించారా నా అశ్వము యొక్క ఉత్తమ గుణము! నిన్న మీరు నన్ను నిందించారు. మీ రాజ్యములో నున్న గొప్ప అశ్వములు గూడ నన్ను పట్టుకొనలేక పోయినవి. నేను వెనుదిరిగి చూడ మీ అశ్వములలో నొకటి నిన్న క్రిందపడిపోయినది. మిగిలిన అశ్వములు అలసట చెందినవి. కాని నా గుఱ్ఱము ఏమాత్రము అలసట జెందలేదు. ఇప్పటికైనా చెప్పండి మీ ధనము మీకు కావాలా లేక గుఱ్ఱము కావాలా" అనెను. ఖలీఫా అమితానందముతో "గుఱ్ఱము నిచ్చి వెళ్లు! నీకు ఇచ్చిన లక్ష రూప్యములు గాక వేరే మఱియొక లక్ష రూప్యములు బహుమానముగా నిచ్చుచున్నాను" అని చెప్పెను. కరీము 2 లక్షల రూపాయలు తీసుకొని సంతృప్తిగా వెళ్ళిపోయెను.

★

ఎ. వాసుదేవరావు

"రామారావుకి అంతజీతం వస్తుందిగదా, ఏం చేస్తాడో అంతా. ఎప్పుడు చూసినా డబ్బు లేదు, డబ్బు లేదు అనే మాట తప్ప మరోటి లేదు".

"ఏం, నీ కేమన్నా బాకీ ఉన్నాడా?"

"అబ్బే, నేనే బాకీ ఉన్నాను."

బాలసాహితి సీరియల్

# సాగరగర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

## 2. వాదోపవాదాలు

ఈ విషయంలో ఇలాగ పెద్ద గందరగోళం బయలు దేరిన సమయంలో ప్రకృతిశాస్త్రపరిశోధన కోసం చేసిన నెబ్రాస్కా యాత్ర ముగించుకొని నేనప్పుడే తిరిగి వచ్చాను. ఆరోజుల్లో నేను పారిస్ మ్యూజియంలో ప్రకృతిశాస్త్రంలో అసిస్టెంటు ప్రొఫెసరుగా పని చేస్తూండేవాణ్ణి. అందుచేత నేఫ్రెంచి ప్రభుత్వం నన్నా యాత్రకు పంపించింది. మార్చి నెలాఖరుకు నేను నెబ్రాస్కా యాత్ర ముగించుకొని న్యూయార్క్ నగరం చేరుకొన్నాను. నెబ్రాస్కాలో ఉన్న 6 నెలలలోను ప్రకృతిశాస్త్రానికి సంబంధించిన అత్యద్భుతమైన వస్తువులెన్నో సేకరించాను. ఇక మే నెల ప్రారంభంలో తిరిగి పారిస్ నగరం వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాను. నేను సేకరించిన విచిత్ర వస్తువులన్నీ తొందరతొందరగా వేరువేరువర్గాలుగా విభజించుకొని ప్రయాణానికి సిద్ధమయ్యాను. సరిగా ఆసమయంలోనే స్కోటియా ప్రమాదం జరిగింది.

నాకు జలజంతువుల స్వరూప స్వభావాలన్నీ బాగా కొట్టిన పిండే.

అనువాదం:

"వినాయక"

ఆ విషయాలన్నీ నాకంత బాగా తెలిసిఉండడంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు! ఆ విడ్డూరం జరిగినప్పటినించీ నేను అమెరికా పత్రికలు, ఐరోపాదేశాల పత్రికలు, క్షుణ్ణంగా చదువుతూనే ఉన్నాను. కాని అవి చదవడంవల్ల నాకు కొత్తగా తెలిసినదేమీ కనిపించలేదు. ఆలోచించినకొద్దీ ఆ వ్యవహారం అంతా చాలా విచిత్రంగా కనిపించింది. అందువల్ల నాకు ఎటూ నిర్ణయించడానికీ పాలుపోలేదు.

నేను న్యూయార్కునగరం చేరుకునేసరికి ఆ విషయంలో వాదోపవాదాలు బాగా తీవ్రంగా పెచ్చు పెరిగిపోతున్నాయి కొంతమంది అది తేలుతూ మునుగుతూ పోయే కొండగుట్టే అయిఉండాలని వాదించారు. కాని చాలామంది ఆ అభిప్రాయంతో ఏకీభవించలేదు. ఆ కొండగుట్టలోలోపల ఏదో ఒక యంత్రంవంటిది ఉంటే తప్ప అది అంతంత దూరం ప్రయాణం చెయ్యడం ఎలా కుదురుతుంది? కనక ఆ వాదం దానంతట అదే చల్లారిపోయింది. కొంతమంది అది సగం సగం మునిగిపోయిన ఓడ అడుగు భాగం కావచ్చునని వాదించారు. కాని పై కారణంవల్లనే ఆ వాదం కూడా అలాగే చల్లారిపోయింది.

# ★ సాగరగర్భంలో సాహస యాత్ర ★

ఇక ఆ విషయంలో రెండే రెండు సిద్ధాంతాలు నిలబడ్డాయి. కొందరది ఏదో ఒక బ్రహ్మాండమైన తిమింగిలమై ఉండవచ్చునని ఊహాగానాలు చేశారు. మరి కొందరది ఏదో పెద్ద జలాంతర్గామి అయి ఉండవచ్చునని వాదించారు. ఆ విషయంలో రెండు పక్షాల వారు రెండు పెద్దపెద్ద వర్గాలుగా చీలిపోయారు. శాస్త్రీయంగా ఖచ్చితంగా వాదించుకోవడం మొదలుపెట్టారు. అయితే అమెరికాలోను, ఐరోపాలోను ఉన్న ప్రభుత్వవర్గాల భోగట్టా ప్రకారం అది జలాంతర్గామి కాదనీ అలాంటిదెవరూ తయారుచేసి ఉండ లేదనీ తేలిపోయింది. అదీగాక ఎవరో ఒక ప్రత్యేకవ్యక్తి అలాంటి జలాంతర్గామి తయారుచేసిఉండడంకూడా అసంభవం! ఒకవేళ అలాంటి జలాంతర్గామి ఎవరైనా నిర్మించిఉంటే ఆ రహస్యం ఎవరికీ తెలియకుండా ఉండడముకూడా చాలా కష్టమే! అయితే ఏదైనా ఒకదేశ ప్రభుత్వం అలాంటి విచిత్రమైన జలాంతర్గామి నిర్మించి అది మిగిలిన ప్రభుత్వాలకు తెలియకుండా అతిరహస్యంగా దాచి ఉండవచ్చును. అందులోను అత్యంత భయంకరమయిన మారణాయుధాలు నానాటికీ పెచ్చుపెరిగిపోతున్న ఈ రోజుల్లో ఎవరైనా అలాంటి జలాంతర్గామి తయారు చేశారేమో! ఎవరు చెప్పగలరు? ఇప్పుడు టార్పెడోలు కనిపెట్టారు గదా! ఆపైన అంతకన్నా భయంకరమైన జలాంతర్గాములు కూడా తయారుచేశారేమో? ఎవరెరుగుదురు?

అయితే అన్యాప్రపంచప్రభుత్వ వర్గాలవారందరు కలిసి ఇంతవరకు ఎవరు జలాంతర్గామి తయారు చెయ్యలేదని ఒక సంయుక్త ప్రకటన చేసేసరికి జలాంతర్గామి సిద్ధాంతం అంతా ఒక్కసారిగా నేలమట్టం అయిపోయింది. ప్రత్యేక వ్యక్తులెవరైనా అలాంటిది నిర్మించడం అసంభవమే అని అందరు అంగీకరించారు. అలాంటప్పుడు ప్రభుత్వాలు జలాంతర్గాములు నిర్మించడం అంతకన్నా అసంబద్ధం! ప్రభుత్వ వర్గాల్లో అలాంటి రహస్యాలు దాచడం చాలా కష్టం. ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, ప్రష్యా, స్పెయిన్ మొదలైన ప్రభుత్వ వర్గాల్లో గట్టిగా భోగట్టా చేసినమీదట జలాంతర్గామి సిద్ధాంతం ఎంతమాత్రం నమ్మడానికి వీలు లేదని తేలిపోయింది.

నేను న్యూయార్కు చేరుకొన్న తరవాత చాలామంది నన్నీ అద్భుత విషయాన్ని గురించి ప్రశ్నించారు. పిమ్మట న్యూయార్కు హెరాల్డ్ నాకొక లేఖ వ్రాసింది: 'పారిస్ మ్యూజియం ప్రకృతిపరిశోధన శాస్త్రవిద్వాంసులు ప్రొఫెసర్ అరోనాకు — ఆర్యా! ప్రస్తుతం ప్రపంచం అంతటా ఆందోళన కలిగిస్తున్న సాగర జంతు సమస్యపై తమ అమూల్యాభిప్రాయం వ్రాసి మా పత్రికకు పంపించవలసిందని ప్రార్థిస్తున్నాము."

—"సంపాదకుడు"

తరవాత నేనాపత్రికలో ప్రకటించిన వ్యాసంలో ఒక భాగం ఈ క్రింద ఉదాహరిస్తున్నాను.

"ఈ విషయంలో వాదోపవాదాలు, సిద్ధాంతాలు అన్నీ జాగ్రత్తగా పరిశీలించినమీదట వీటిలో చాలా సిద్ధాంతాలు కేవలం అసంబద్ధంగా ఉన్నాయని నిశ్చయించక తప్పదు. అయితే సముద్రంలో బ్రహ్మాండమయిన తిమింగిలమేదో ఉండి ఉండాలనే సిద్ధాంతం ఒక్కటే కొంచెం నమ్మదగినదిగా కనబడుతూంది.

సముద్రంలో అట్టడుగుభాగం స్వరూపస్వభావాలెలాంటివో మన కేమీ తెలియవు! సముద్రంలో పది పదిహేను మైళ్ల లోతున ఎలాంటి అత్యద్భుత జలజంతువులు నివసిస్తున్నాయో ఎవరు చెప్పగలరు? ఆ జంతువు లేవిధంగా జీవిస్తున్నాయో ఊహించడం కూడా చాలా కష్టం. సాగరగర్భంలో నివసించే సముద్ర జీవాలలో అత్యద్భుతమైన వర్గాలెన్నో ఉన్నాయి. వాటి స్వరూప స్వభావాలు మన కేమీ తెలియనే తెలియవు. ఆ పెద్ద జంతువులు అప్పుడప్పుడు సముద్రం పైభాగానికి వస్తే రావచ్చును.

ఒకవేళ ఆ జంతువు తిమింగిలం జాతికే చెందినదని అనుకుంటే అది చాలా పెద్ద తిమింగిలమని నిశ్చయించక తప్పదు. దాని పరిమాణం ఇంతకుముందెన్నడు కని విని ఎరగనంతటి గొప్పదై ఉండాలని కూడా అంగీకరించాలి.

సామాన్యంగా మనకు కనిపించే తిమింగిలం పొడుగు 60 గజాలే. తిమింగిలగిలం అంతకన్నా పదిరెట్లెక్కువ పెద్ద జంతువు. శక్తి సామర్థ్యాలు, వేగము మొదలైన అన్ని విషయాల్లోను అది తిమింగిలం కన్నా పదింతలు పెద్దదని జలజంతు

శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. దాని కోరలు మొదలైనవి ఆ పరిమాణాన్ని బట్టి చాలా పెద్దవిగానే ఉంటాయి. స్కోటియా మొదలైన నౌకలను చీల్చి ముంచివేసే శక్తి కలిగిన జంతు వదే అయిఉంటుంది.

తిమింగిలానికి దంతాలు, కోరలు చాలా పెద్దవిగాను, భయంకరంగాను ఉంటాయని సాగర జంతు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. చూడడాని కవి ఉక్కు తునకలే అనిపిస్తాయి. అలాంటి పెద్దపెద్ద కోరలతో పెద్దరకం తిమింగిలాలు చిన్నరకం తిమింగిలాలను చంపివేస్తూంటాయి. చిన్నరకంతిమింగిలాలనుకొన్నింటిని పట్టుకుని పరిశీలించగా వాటిలోలోపల ఆ పెద్ద కోరలు కనిపించాయి. ఇంకా కొన్ని పెద్ద కోరలు ఓడల అడుగు భాగాలలోనించి పైకి తీశారు. అవి తిమింగిలాల కోరలే అని నిశ్చయించారు. పారిస్ మ్యూజియంలో ఇలాంటిదే ఒక పెద్ద కోర జాగ్రత్త చేశారు. దాని పొడవు రెండుంబావిక గజాలు. అట్టడుగున దాని వ్యాసం 15 అంగుళాలు.

ప్రస్తుతం దీనికి పదిరెట్లు పెద్ద కోరే ఒకటి ఉన్నదని అనుకుందాము. దీనినిబట్టి ఆ కోర కలిగిన జలజంతువు పరిమాణం ఎంత పెద్దదో ఊహించుకోవచ్చును ఆ జంతువు ఆ కోర గంటకు 20 మైళ్ల వేగంతో ఓడ అడుగుభాగానికి తగిలేటట్టుగా కొట్టిఉండవచ్చునని అనుకుందాము. అలాంటి దెబ్బ తగిలినప్పుడు ప్రస్తుతం మనం చర్చించే ఆఘాతంవంటి ఆఘాతమే తగలవచ్చును. అందుచేత పూర్తి వివరాలు తెలిసేదాకా అలాంటి పెద్ద జంతువువల్లనే ఆ ప్రమాదం జరిగి ఉండాలని ఊహించడంకంటె వేరే గత్యంతర మేమీ లేదు. ఇంకా అంతకన్నా పెద్ద విచిత్రమే జరిగిందని ఎవరైనా నిరూపించేదాకా నే నూహించే దింతే."

నేను వ్రాసిన వ్యాసం చదివి చాలామంది ఔనంటే ఔనని తల లూపారు. అనేకులు నా వ్యాసాన్ని గురించే చర్చించడం మొదలు పెట్టారు. చాలామంది పూర్తిగా నా అభిప్రాయాలతో ఏకీభవించారు. నేను సూచించిన సమస్యా పరిష్కారం ఇంకా మరి కొన్ని ఊహాగానాలకుకూడా దారి తీసింది. అసలు మానవుల హృదయాలలోనే అలాంటి పెద్ద పెద్ద జంతువు నూహించేస్వభావం ఒకటి ఉంది. అలాంటి బ్రహ్మాండమయిన పెద్దపెద్ద జంతువులు జీవించడానికీ, పెరగడానికీ అనువైనది సాగర గర్భమే. వాటికీ భూమిపై సంచరించే ఏనుగులు మొదలైన పెద్ద జంతువులకు హస్తిమశకాంతరం! సముద్రంలో ఎంతెంత పెద్దపెద్ద తాబేళ్లు, పీతలు, మొదలైన జంతువులున్నాయో ఎవరు చెప్పగలరు? సముద్రం లోలోపల రెండు వందల టన్నులు తూగే పీతలు కూడా ఉన్నాయని అంటారు. అదికాదని ఎవరనగలరు ? ప్రాచీనకాలంలో భూమిమీద కూడా చాలా పెద్ద జంతువు లుండేవని తెలుస్తున్నది. క్రమక్రమంగా అవ్వన్నీ నశించి పోయాయి. అలాంటి చిత్ర విచిత్రమయిన పెద్దపెద్ద జంతువులు సముద్రగర్భంలో ఎందు కుండ గూడదు?"

పూర్వం ఇలాంటి ఊహాలన్నీ నాకు కేవలం పగటి కలలలాగే కనిపించేవిగాని ఇప్పుడవన్నీ యధార్థాలే అనిపించాయి.

కొంతమంది కిది అంతా కేవలం శాస్త్రీయ చర్చలాగే కనిపించింది. మరి కొందరింకా ముందుకు వెళ్లిపోయారు. సముద్రంలో ఆయా ఖండాల మధ్య ఏవిధమైన ఆటకాలు లేకుండా ఓడల రాకపోకలు కొనసాగాలంటే సముద్రంలో దాగిన ఆ జంతువును వెంటనే హతమార్చి వెయ్యాలని పెద్ద గగ్గోలు లేవదీశారు. క్రమక్రమంగా అమెరికాలోను, ఇంగ్లండులోను అది బాగా పెచ్చుపెరిగిపోయింది.

వెంటనే ఆ విషయంలో కొన్ని ప్రయత్నాలు ప్రారంభమైనాయి. గాని వాటిలో ముందంజవేసింది అమెరికాదేశమే. ఆ దేశంలో, ఆ విషయంలో పరిశోధనలు జరపడానికి కొంతమంది జంతుశాస్త్రవేత్త

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

లను నావికులను పంపించాలనీ ఆ తిమింగిలం అంతు కనుక్కోవాలనీ నిశ్చయించారు. అబ్రహామ్ లింకన్ అనే ఒక యుద్ధ నౌక నౌకదానిని ఆ శాస్త్రవేత్తల పరిశోధనయాత్ర కోసం సిద్ధంచేయించారు. అది చాలా వేగంగా పోయే నౌక. కెప్టెన్ ఫరాగూ దానికి కావలిసిన ఆయుధాలు, మందుగుండుసామగ్రి మొదలైన పరికరాలన్నీ సిద్ధం చేయించాడు.

కాని ఆతరవాత రెండు నెలల వరకు ఆ జలజంతు ఎక్కడా ప్రత్యక్షం కానేలేదు! అన్నీ సిద్ధం చేసినతరవాత ఆ లాంటి దేదో ఒకటి జరుగుతూనే ఉంటుంది. నిజంగా ఆ జంతువు ఆ ఏర్పాటులన్నీ ముందుగానే పసిగట్టేసిందేమో! దీనినిగురించి ప్రపంచం అంతటా పెద్దపెద్ద పుకారులుకూడా బయలుదేరాయి. కొంతమంది అతితెలివైనవాళ్లు ఆ జంతువు సముద్ర మధ్యంనించి పోయే తంత్రీ వార్త కూడా పసిగట్టేసిందనీ, అందుచేతనే అది మళ్లీ కనిపించడమే మానేసిందనీ అన్నారు!

అబ్రహామ్ లింకన్‌లో పెద్దపెద్ద జలజంతువులను, వేటాడడానికీ పట్టుకోవడానికీ ఉపయోగించే పరికరాలెన్నెన్నో అమర్చారు. పెద్ద దూర ప్రయాణానికి కావలసిన ఆహారపదార్థాలు సమృద్ధిగాఆనౌకలో వేశారు. అయితే ఇంతా చేస్తే అంతా సిద్ధంచేసినతరవాత ఆ ఓడ ఎక్కడికి పంపించాలో ఎవరికీ బోధపడలేదు! అందరికీ నానాటికీ విసుగు, నిరుత్సాహము ఎక్కువైపోయాయి.

ఇలా ఉండగా జూలై రెండో తేదీని కాలిఫోర్నియానించి షాంఘేకు పోయే స్టీమ్ మరొకటి ఉత్తర పసిఫిక్ మహాసముద్రంలో ఆ జలజంతువు నెదుర్కొన్నది. అది జరిగి అప్పుడే ఊహాపోహాలు గడిచిపోయాయి.

దాంతో అమెరికాఅంతటా మళ్ళీ ఒక పెద్ద గగ్గోలు బయలుదేరింది. కెప్టెన్ ఫరాగూ వెంటనే 24 గంటలలో తన యుద్ధ నౌకతో బయలుదేరి వెళ్లిపోవాలని ఉత్తరువులు జారీ అయిపోయాయి. ప్రయాణానికికావలసిన రాక్షసిబొగ్గు మొదలైనవన్నీ ఓడలోకి ఎక్కించేశారు. దానిలో పనిచేయడానికి నియమింపబడిన నావికులందరు సిద్ధంగా ఉన్నారు. ఇక యుద్ధనౌక బయలుదేరడమే తరువాయి.

ఆపైన ఓడ మూడు గంటలకు బయలుదేరుతుందనగా నా కొక లేఖ చేరింది:

ఆర్యా!

మీరీ శాస్త్రపరిశోధనయాత్రలో పాల్గొనాలని మా కోరిక. మీరీ యాత్రలో పాల్గొన్న పక్షంలో అమెరికాప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధిగా మీకు గౌరవపదవి కల్పించాలని ఉవ్విళ్లూరుతున్నది. కెప్టెన్ ఫరాగూ మీకై ఓడలో ప్రత్యేకంగా ఒక గది కేటాయించి ఉంచారు. మీరు మా ప్రార్థన మన్నించగలరని ఆశిస్తున్నాను.

విధేయుడు,

జె. బి. హాబ్సన్:

నౌకాశాఖ కార్యదర్శి.

ఇంకా ఉంది.

★

# వాగ్దానం

ఒకానొకప్పుడు మహా బలపరాక్రమవంతుడైన రాజు సువిశాలమైన, సుసంపన్నమైన ఒక దేశాన్ని పరిపాలించాడు. తన దేశంలోని ఏ ఒక్కడు ఆకటి బాధతో అలమటించరాదని, బీదప్రజానీకపు అవసరాలను తీర్చెదననీ ఆ మహారాజు ప్రకటించడంచేత అతని కొలువులోనివారందరు అతనిని ప్రేమించేవారు. అతని న్యాయవర్తనను, విజ్ఞాన వివేకములను ప్రస్తుతించేవారు.

అయితే మహారాజ కుమారుడు తండ్రికి పూర్తిగా విరుద్ధవర్తి. వట్టి సోమరి. రాజవాలనే ఆ కాంక్ష లేదు. ఇలావుండగా ఒకరోజున ఒక జ్యోతిష్కుడు రాకుమారుడు జనకునితో "మీకు స్వప్నములలో దైవ సహాయం లభిస్తుంది" అని చెప్పాడు. "ఆహా! ఎంతటి అదృష్టవంతుణ్ణి! ఇక ఎవరి సలహాలు పొందడానికీ పాట్లు పడనక్కర్లేదు" అనుకున్నాడు రాకుమారుడు జనకుడు.

చాలాకాలం గడిచిపోయింది. ఒకనాటి రాత్రి జనకునికి ఒక వింత కల వచ్చింది. ప్రతిరాత్రీ ఆ కల కస్తూనే వచ్చింది. 'ఒక మహానదికి ఆవలప్రక్క సుదూరంలో ఒక భాగ్యవంతమైన రాజ్యముందనీ, ఆ దేశపు రాజు ఒక సుందర భవనమును స్ఫటికంతో కట్టించాడనీ, అందులో అపురూప లావణ్యవతియైన రాకుమార్తె నివసిస్తున్నదనీ, భోగభాగ్యాలతో తులతూగుతున్నదనీ, ఆ భవనం చేరడం చాలా కష్టమనీ, ఎందరెందరో రాకుమారులు ఆ నదిని దాటలేక, ఆ భవనం చేరలేక మరణించారనీ, తెగువతో తనను చేరువారికోసం ఆమె వేచివున్నదనీ ఆ కల సారాంశము.

"ఈ కల ఉద్దేశం ఏమై వుంటుంది?" అనుకున్నాడు రాజకుమారుడు. అదే విషయమై నిరంతరం ఆలోచించసాగాడు.

తన ప్రియసుతుడు భ్రాంతిలో పడ్డాడని ఈ సంగతిని విన్న రాజు కలతచెందాడు. రాకుమారుడు జనకునకు వచ్చిన స్వప్నోద్దేశమును వివరించవలసిందిగా జ్యోతిష్కుడు అభ్యర్థించబడినాడు. రాజ్యములోని వేదాంతులందరు యువరాజు ఈ వ్యవహారమునంతను మరచిపోయేటందుకు ఏ ఏ గ్రహములను ఏవిధముగా పూజించవలెనో నిర్ణయించేందుకు సమావేశమైనారు. చివరకు అందరి ప్రయత్నాలు విఫలమైనాయి. యువరాజునకుమాత్రం శాంతి లేకుండా పోయింది.

ఒకరోజున యువరాజు ఏకాంతముగా ఇలవేల్పుమందిరమునకు వెళ్ళి సాష్టాంగదండప్రణామ మొనర్చాడు. "జనకా! నీవు కల గనినట్లే అక్కడొక సుందర భవనముంది. అందులో అందాలుచిందు రాకుమార్తె కూడా ఉంది. ఆమెను వివాహం చేసికోవలెనని నువ్వు కోరే పక్షంలో నీకు సాధ్యమే!" అను మాటలు వినిపించాయి.

**క. రామచంద్రరావు**

యువరాజు ఆశ్చర్యంతో "దయామయీ! నేనెలా ఆ కన్యను వివాహం చేసికోగలనో దయచేసి చెప్పు" అని అర్థించాడు.

"ఆ మహానదికి సుదూరంలో వున్న సుందరభవనంలో నివసిస్తున్న రాకుమారి నిలీమా అభేద్యమైన ఆ జలప్రవాహాన్ని అధిగమించి వెళ్లువానిని వివాహం చేసుకుంటుంది. నీవు ప్రశాంతచిత్తుడవై ఉండు. నా దూత ఒకడు నీకు సర్వవిధాల సహాయం చేస్తాడు" అని ఆ వాణి తిరిగి చెప్పింది.

ఒకనాటి సాయంత్రం రాకుమారుడు జనకుడు పురవీధులగుండా వెళుతుండగా ఒక నిర్జన ప్రదేశంలో చినిగిన గుడ్డపేలికలతో ఉన్న ముష్టివాడు అతనిని వెంబడించాడు. కొంతదూరం అలా పోయి ఆ ముష్టివాడు "యువరాజా! విను. సుందర భవనానికి చేసే నీ ప్రయాణంలో సర్వసహాయం నీకు లభిస్తుంది. అయితే నువ్వు బీదప్రజలను ప్రేమిస్తాననీ, వారి వాంఛలను నెరవేరుస్తాననీ వాగ్దానం చెయ్యాలి" అన్నాడు.

యువరాజు ఈ మాటలను విని సంభ్రమాశ్చర్యాలతో "బీదప్రజా

 

# వాగ్దానం



నీకాన్ని నే నెన్నడూ మరువను. కాని నా స్వప్నలోకాలకు నా ప్రయాణం ఎప్పుడు ఏ విధంగా సాగుతుందో దయచేసి త్వరగా చెప్పు" అని వేడుకున్నాడు.

"రేపు" అంటూ ముష్టివాడు అంతర్ధానమైపోయాడు.

జనకుడు హుటాహుటీగా రాజప్రాసాదమ్మును చేరి, తండ్రిని సందర్శించి రాజ్యంలోని కొన్ని ప్రదేశాలను తిలకించి వచ్చుటకు అనుజ్ఞనివ్వవలసిందిగా కోరాడు.

"అలాగే వెళ్ళిరా నాయనా!" అంటూ ఎన్ని ఏనుగలు, ఎంతమంది దాస దాసీజనము కావాలి? అని ప్రశ్నించాడు రాజు.

"నాన్నగారూ! నేను ఒంటరిగానే ప్రయాణించాలి" అన్నాడు జనకుడు. హృదయభారంతో కృంగిపోయి రాజు తన కుమారుడు ఒంటరిగా దేశాటన చెయ్యడానికి అనుమతించాడు.

యువరాజు జనకుడు ప్రయాణమై కొన్ని మైళ్లు నడిచి నడిచి ఒక కీకారణ్యం ప్రవేశించాడు. ఆ అరణ్యం అతనికి కలలో కనబడిన దానివలెనే వుంది. "ఇప్పుడు ఏ మార్గాన వెళ్లాలి నేను?" అని తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

ఇంతలో చినిగిన గుడ్డపేలికలతో ముష్టివాడు ప్రత్యక్షమై "ఓయీ! స్వప్నలోకాలకు ప్రయాణించే నిన్ను చూసినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. పరాక్రమవంతుడా! ఇదిగో నీకు ఎగిరివెళ్లే అశ్వాన్నీ, గుడ్లగూబ భాషను అర్థం చేసుకునే శక్తినీ ప్రసాదిస్తున్నాను. గుడ్లగూబ తెలివైన పక్షి. దాని మాటలను జాగ్రత్తగా విని ఆవిధంగా చెయ్యి" అని చెప్పాడే ఆ ముష్టివాడు అదృశ్యుడైనాడు.

యువరాజు రెక్కల గుర్రాన్ని అధిష్ఠించాడు. ఆ వెంటనే అది వాయువేగంతో రివ్వున అంతరిక్షాన ఎగర నారంభించింది. అడవులను, లోయలను దాటి ఆ మహానదిని కూడా దాటివేసింది. "ఆహా! ఏమి దేశం! నిజంగా ఇది దేవతల దేశమే" అనుకున్నాడు జనకుడు తనలో. ఆ దేశాన్ని చూస్తూవుంటే అతను కలలో గాంచిన దృశ్యాలన్నీ స్ఫురణకు వచ్చాయి. ఇంతలో స్ఫటిక నిర్మితమైన సుందరభవనం కనబడగానే అతని హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

రాజప్రాసాదం ముందు గుర్రం ఆగింది. యువరాజు జనకుడు అశ్వమును దిగి తన రాకను మహారాజుకు తెలుపవలసిందని ద్వారపాలకులను కోరాడు. వెంటనే అతనికి ప్రవేశమివ్వబడింది. ఆతర్వాత రాకుమార్తె నిలీమా ఎదుటకు యువరాజు కొనిపోబడ్డాడు.

"యువరాజా! జనకా! మీరు అభేద్యమైన మహానదిని దాటిరాగలిగారు. మా బిడ్డ మిమ్ములను పరిణయమాడగలదు" అని ప్రకటించాడు రాజు.

చాలా తక్కువ వ్యవధిలోనే వివాహ సంబారములన్నీ సమకూర్చబడినవి. రాజ్యమంతటా ఆనందోత్సవం వెల్లివిరియగా రాకుమారి నిలీమాకు యువరాజు జనకునకు వివాహమహోత్సవం వైభవోపేతంగా జరిగింది.

కొన్ని మాసాలు ఆ నూతన దంపతులు స్ఫటిక మందిరంలో గడిపిన తరువాత ఒకరోజున తన ప్రియసఖిని చేరి "మా దేశం నిన్ను తీసుకొని వెడతాను. అయితే అక్కడ స్ఫటికమందిరాలు లేవు. కాని నిన్ను చూసి మా జననీ జనకులు మహానంద సంభరితులవుతారు. నీకు సౌఖ్యప్రదంగా ఉండే ఏర్పాట్లన్నీ చేస్తారు" అన్నాడు యువరాజు. రాకుమారి నిలీమా అందుకు ఆమోదించింది. ఆమె తండ్రి వారి ప్రయాణానికి తగు ఏర్పాట్లు చేయించాడు.

సాయంత్రమయేసరికి ఒక అరణ్యం వెలుపల పరివారమంతా ఆగిపోయింది. ఆ రాత్రికి అక్కడే ఉండిపో నిశ్చయించుకొన్నారు. రాజదంపతులు ఒక గుడారంలో నిద్రిస్తుండగా అర్ధరాత్రి సమయాన గుడ్లగూబ అరుపులకు యువరాజు మేల్కొంచాడు. బయటకు వెళ్ళి ఆ పక్షి మాటలను ఆలకించాడు. "రాజా! నీ సుఖశాంతులకోసం నీ దేశప్రజలలో ఏ ఒక్కరినీ ఆకటిచిచ్చుకు ఆహుతి కానివ్వకు" ఈ మాటల అర్థం ఏమిటో అతనికి తెలియలేదు. తన దేశప్రజలు సుఖంగా, హాయిగా వున్నారని అతని విశ్వాసం

ఆ మరునాడు నూతన వధువును వెంట నిడుకుని జనకుడు తన దేశం ప్రవేశించాడు. మహారాజు ఘనస్వాగతమిచ్చి దేశమంతా వైభవంగా వేడుకలు జరిపించవలసిందని ఆజ్ఞాపించాడు.

రాకుమారి నీలిమకు ఈ నూతన జీవితం సంతృప్తికరంగా లేదు. ఆమెకిచ్చిన భవనం స్ఫటిక నిర్మితం కాదు. రాజ దంపతులు, యువరాజు ఆమె సౌఖ్యంకోసం ఎన్నో ఏర్పాట్లు చేశారు. కాని తనకు స్ఫటికనిర్మితభవనం నిర్మించవలసిందిగా ఆమె పట్టుబట్టింది.

"అలాగైతే సరే!" అని రాజు అతివేగంగా ఒక భవనం నిర్మింపబడాలని ఆదేశించాడు. కాని యింతలో ఆయన పరమపదించాడు. రాజ్యభారమంతా యువరాజు భుజస్కంధాలపై పడింది. యువరాజు తన కాలాన్నంతటినీ భవన నిర్మాణంలో వినియోగించేందుకు మంత్రులకు రాజ్యపాలనను అప్పగించాడు.

ఎట్టకేలకు భవననిర్మాణం ముగిసింది. ఒక సుముహూర్తాన వస్త్ర వాహనాదులతో భార్యను తీసికొని రాజు జనకుడు గృహప్రవేశమైనాడు. ఉద్యానవనం నిండా పూల తీగలు, లతలు, మొక్కలు పెంచబడినవి. ఆ వనము దేవతల వాసస్థలమా అన్నట్లున్నది. నూతన ప్రభువు జనకుడు, సుఖాభిలాషియై ఉజ్జ్వలభవిష్యత్తుకు ఎదురుచూస్తూవున్నాడు.

ఆ మొదటి రాత్రే అతని నిద్ర చెడు కలవలన భంగమైనది. తన ప్రియసఖి శిలారూపమును పొందినట్లు కలగన్నాడు జనకుడు. "ఈ స్వప్నోద్దేశం ఏమై వుంటుంది ?" అనుకున్నాడు తనలో. గతంలో వలెనే ఈ కల కూడా యథార్థమవుతుందేమోననే భయం అతనిని ఆవహించింది. వెంటనే వెనుదిరిగి చూశాడు. తన భార్య సుఖంగా నిద్రపోతున్నట్లు కనిపించింది. కాని ఉచ్ఛ్వాస నిశ్వాసముల జాడ కానరాలేదు. ఆమె నుదురును తాకగా మంచువలె చల్లగా వుంది. ఆమె పెదవులను స్పృశించాడు. భయభ్రాంతుడైనాడు. ఆమెలో బ్రతికుండిన ఛాయలు లేవు.

"ఇంతటి క్రూరశిక్షను అనుభవించడానికి నేనేమి పాపం చేశాను" అని అరిచాడు ఉద్వేగంతో జనకుడు.

మంత్రులు రావించబడినారు.

# గుణపాఠం



వి. కె. దాసరి

వివేకానందు డొకసారి
కాశీపట్నం చూద్దామని
కలకత్తాలో రైలెక్కాడు.
అత నెక్కిన రైలుపెట్టెలో
ఉన్నై రెండంటే రెండు బల్లలు
ఆ పెట్టెలోనే ఉన్నా డొక
ఆంగ్లేయుడు.
ఒక బల్లమీద తన
పెట్టె పెట్టుకొని
మరో బల్లమీద
తను పడుకున్నాడు.
మన వివేకానందుడు
ఆంగ్లేయునితో అన్నాడు.
"పెట్టే తీసి పైన పెట్టుకో"మని
ఆంగ్లేయుడు అందుకు—
ఆ పెట్టె తనది కాదన్నాడు.
"పెట్టెగల మనిషి
రైలు దిగి వెళ్ళాడు
స్టేషనుకు ఎందుకో"
అన్నాడు విసురుగా.
రైలు కదిలిందింతలో
వివేకానందుడు
కదలక
మెదలక
నిల్చున్నాడు.
ప్లాటుఫారం దాటి
ఒక్కొక్క పెట్టే
వచ్చేస్తున్నాయి
యివతలకి—
ఆ పెట్టెగల మనిషి
రైలు ఎక్కలేదు.
ఇది గ్రహించాడు
వివేకానందుడు
ఆ పెట్టెను బైటకి
విసరివేసి
బల్లమీద
కూర్చున్నాడు
ఆంగ్లేయుడు
ఖంగారుపడ్డాడు.
"అదేమిటి! ఆ
పెట్టె పారేశావేం?"
అన్నాడు.
"పాపం! ఆ పెట్టె
గల మనిషి బైట
ఉండిపోయాడు
అవస్థపడతాడని
పెట్టె విసిరేశాను"
అని అన్నాడు
వివేకానందుడు—
ఆంగ్లేయునికి
తగిన గుణ
పాఠం అయిందని
అందరనుకున్నారు!



# వాగ్దానం



గొప్ప గొప్ప పండితులు విచ్చేసినారు. జ్యోతిష్కులు వచ్చినారు. అందరూ ఈ ఘోరవిపత్తుకు కారణ మేమిటో ఒకరితో నొకరు సంప్రదిస్తున్నారు. ఆస్థాన సంగీత విద్వాంసులు తమ సంగీత ప్రావ్యధ్వనికి రాణి మేల్కాంచునని భావించారు. భూతప్రేత పిశాచాదులు ఆవహించిన యెడల పారిపోవునని తలచినారు. పండితులు మంత్రాలు వల్లించారు. గుగ్గిల ధూపం వేశారు. అనేక దీపాలు వెలిగించారు.

కొన్ని వారాలు గడిచినా రాణిలో చలనం కనిపించలేదు. నూతన భవనం - స్ఫటిక నిర్మిత భవనం - పీడ కొట్లాడుతున్నట్లున్నది. ఆకాశం మేఘాచ్ఛాదితమై వుంది. పక్షులు కిలకిలారావం చేయడం లేదు. వృక్షములు ఆకులను రాల్చివేసినవి. పూలమొక్కల మొగ్గలు విప్పారడంలేదు. పరిమళం వెదజల్లడం లేదు.

ఒకనాటి సాయంత్రం విచార గ్రస్తుడై యువరాజు భార్యశయ్యపై కూర్చునిఉండగా గుడ్డ పేలికలతో వున్న ముష్టివాడు దర్శనమిచ్చాడు. "ఇప్పుడేమి కావాలంటాడు?" అనుకున్నాడు జనకుడు తనలో.

"ఓ రాజా! నీ వాగ్దానాన్ని విస్మరించావు!" అనే మాటలు వినిపించాయి.

"ఏం వాగ్దానం?" అని అరిచాడు రాజు. కాని సమాధానం లేదు. ముష్టివాని ఛాయా లేదు. రాజు విచలితుడై [illegible] బయటకు రాగా గుడ్లగూబ అరుపు వినిపించింది.

"చెప్పు! నువ్వు చెప్పు. తెలివైన పక్షీ! నా రాణి బ్రతుకుతుందా" అని దీనంగా అడిగాడు.

"నీ వాగ్దానాన్ని నువ్వు విస్మరించావు రాజా! నీ రాజ్యంలో కరువుకాటకాలు ప్రజలను పట్టి పీడిస్తున్నాయి. ఆ ప్రజలే నీ సుఖ శాంతులను మౌనంగా దోచివేశారు" అని చెప్పింది.

వెంటనే రాజు మంత్రులను రావించాడు. ప్రజల పరిస్థితి వినిపించమన్నాడు. మంత్రులు సిగ్గుతో తలలు వంచి చెప్పారు: "రాజా! వందలకొలది ప్రజలు ఆకటిచిచ్చుకు ఆహుతి అయినారు. మహారాజు మరణంతో వారి కష్టాలను తప్పించడానికి మేమేమీ చెయ్యలేకపోతున్నాము."

రాజుకు చప్పున తాను లోగడ చేసిన వాగ్దానం స్ఫురణకు వచ్చింది. వెంటనే ఇలా అన్నాడు "విశ్వాస పాత్రులైన మంత్రులారా! వినండి! అనహాయులు, అభాగ్యులు, దరిద్ర నారాయణులు అయిన నా ప్రజల సేవ నేటినుండి చేయాలని స్థిరపరుచుకొన్నాను. ఇది నా దృఢ సంకల్పం. వారికొరకు ధనాగారం లోని యావత్తూ వినియోగించండి. రాజ్యంలోని కరువురాక్షసిని తరిమివెయ్యడానికి నేను సంసిద్ధుడనై వున్నానని ప్రకటించండి."

ఆతర్వాత రాజు పురవీధులలోనికి వెళ్ళాడు. వృద్ధులు, పెద్దలు, స్త్రీలు, పిల్లలు, అందరూ దారులు తెరిచి నిలబడి హర్ష నినాదాలు చేశారు. రాజు ప్రజల నుద్దేశించి "పౌరులారా! నేటినుండి నా రాజ్యంలో ఏ ఒక్కరు ఆకటి బాధకు గురికాకుండా నేను తగు జాగ్రత్త తీసుకుంటాను. బీదాసాదా నావద్దకు స్వయంగా వచ్చి తగు సహాయం పొందవచ్చు" అని అభిభాషించాడు.

అక్కడ గుమికూడిన ప్రజలు మహోత్సాహంతో జేజేలు కొట్టారు. ఆనందబాష్పములను రాల్చారు. తన ప్రజల ప్రభుభక్తిని కన్నులార గాంచి రాజు పరమానంద సంభరితుడైనాడు. అతని హృదయం ద్రవించిపోయింది.

అదే రోజు సాయంత్రం ఒక చెట్టు నీడలో రాజు విశ్రమించి ఉండగా చినిగిన గుడ్డపేలికలతో, ముష్టివాడు ప్రత్యక్షమై "రాజా! నీ వాగ్దానమును నెరవేర్చుకున్నావు. ఇక చింతించకు. బీదప్రజల బహుమతులైన ఈ ఎర్రనిపూలు తీసుకు వెళ్ళి నిర్జీవియై పడివున్న నీ ప్రియసఖి శరీరంపై జల్లు" అని చెప్పి మాయమైపోయాడు. రాజు ఏమో చెప్పబోయాడు. కాని ఆ ముష్టివాడు వినిపించుకోలేదు. కనిపించనూ లేదు. అక్కడ ఉన్న ఎర్రపూలు ఏరి రాజు తీసుకువెళ్ళి తన భార్య శిలాదేహంపై చల్లాడు. వెంటనే రాణి త్రుళ్ళిపడి లేచి "రాజా! నేను తిరిగి జీవించాను" అంది.

"నేనూ అంతే" అన్నాడు రాజు ఆనందంతో.

—మూలం: ఎస్. [illegible]






## 14. ఏ కవరులో ఎన్ని రూపాయలు?

కలెక్టరుగారి కారు వీధిలో ఆగింది. కలెక్టరు గారి భార్యా, తల్లీ, చెల్లెలూ, పిల్లలూ అందరూ ఎక్కడ పని అక్కడ వదిలేసి ఆయనకి స్వాగతం యివ్వడానికి వీధి గుమ్మందగ్గిరకి పరిగెత్తుకొచ్చారు. నిత్యం కనిపించే మనిషికోసం ఆ రోజులా ప్రత్యేకించి పరుగెత్తుకు రావడంలో విశేషం లేకపోలేదు. ఆవాళ రెండో తేదీ సాయంత్రం. ఆయన జీతం తెచ్చుకునే వేళ. ఒకటో తారీకునే తెచ్చుకొనేవాడు గాని ఆవాళ ఆదివారమై ఊరుకుంది. కలక్టరుగారి కుడిచేతిలో పెద్ద తోలు పర్సు చూడగానే అందరికీ ప్రాణం లేచివచ్చినట్లయింది.

'ఏ నెల కా నెల దాటేస్తున్నావ్. ఈ నెలయినా కొనిపెట్టరా వెంకటేశం! మళ్ళీ కలక్టరుగారి తల్లినని పేరూ - మంచి మడీపంచే లేదు' అంది గుమ్మంలోంచే తల్లి. కె. వెంకటేశ్వర్రావు I. A. S. ఏమీ మాట్లాడలేదు. లోపలికి వెళ్ళిపోయాడు. ఎప్పుడూ లేంది చెల్లెలు మాణిక్యం మొహం కడుక్కోడానికి చల్లని కూజాలో నీళ్లూ, తను ఎప్పుడోకాని వాడని చందనం సబ్బూ, టర్కిష్ తువ్వాలూ ఇచ్చింది.

'అన్నయ్యా, ఒకే, అన్నయ్యా'

మాణిక్యం దేన్నిగురించి అడగబోతోందో వెంకటేశానికి తెలుసు. అందుకని ఏమని కూడా అడగలేదు.

'నువ్వు విసకపోతే చెప్పనులే..'

వెనకనుంచి కాంతం, కలక్టరుగారి భార్య వచ్చింది.

'మా పెద్దా నాతల్లి. మా రత్న మాణిక్యం! ఆయన యింటికొచ్చి నరికిల్లా పట్టుకున్నారేమిట్రా బెల్లంమీద చీమల్లాగ!' అంది. మాణిక్యానికి వదినంటే ఎప్పుడూ భయమే. గబుక్కుని పారిపోయింది.

'అవునూ, ఈ ఖర్చులు ఎప్పుడూ ఉన్నవే గాని అమ్మాయి కెప్పుడండీ నెక్లసు చేయిస్తారు? జీతం రాళ్లే తప్ప పైన ఎర్రని ఏగాణీ ఎరగరాయెను. జీతంలోనే మిగల్చుకపోతే ఇంక దాని మొహం నిండేది ఎప్పుడండీ? నా కెందుకు బాబూ, నచ్చచెప్తే మీకు కోపం. ఊరుకున్నంత ఉత్తమం లేదు' అనేసి కాంతం అక్కడ్నుంచి విసవిస నడుస్తూ వెళ్ళిపోయింది.

వెంకటేశ్వర్రావు తనతో ఉన్న లక్ష్మితోపాటు తనకూ జరిగే గౌరవానికి తనలో తను నవ్వుకున్నాడు.

వెంకటేశ్వర్రావు చాలా తెలివైనవాడు. ఎవరు చెప్పిన మాటా కాదనడు. కాని చివరకి అతని కేలా యిష్టమో అలాగే చేసితీరతాడు. అతనికలాంటి మనస్తత్వముండబట్టే అన్ని భిన్న దృక్పథాలుగల కొంపలో అందరు వ్యక్తులుగల సమిష్టి కుటుంబంలో అలా నెగ్గుకొస్తున్నాడు.

లోపలికివచ్చి గదిలో చూశాడు. స్కూలుఫైనలు చదువుతున్న పెద్ద కొడుకు ప్రకాశం మంచంమీద పడుకుని నిద్రపోతున్నాడు. లోపలికివచ్చి గదితలుపు గడియవేశాడు. గడియచప్పుడుకి ప్రకాశానికి మెలుకువ వచ్చింది. అయినా ఏమీ ఎత

అవసరాల రామకృష్ణరావు

గనట్టు తండ్రేం చేస్తాడో చూద్దామని నిద్ర నటించసాగాడు. కలక్టరుగారు పెద్ద తోలు పర్సు మీట నొక్కి సొమ్ము బయటకు తీశారు. అంతా మొత్తం వెయ్యి రూపాయిలు. పది కట్టలు. ఒక్కొక్క కట్టలో వందేసిరూపాయలున్నాయి. అన్నీ రూపాయినోట్లు. అన్నిరూపాయిలు ఒక్కసారి ఎప్పుడూ చూడక ప్రకాశం కళ్లు జిగేలుమన్నాయి. 'అమ్మయ్యో' అన్నాడు పైకి అప్రయత్నంగా. అప్పుడే యినప్పెట్టె తీస్తున్న కలక్టరుగారు వెనక్కి తిరిగిచూశాడు.

'నువ్వు లేచేఉన్నావ్రా? హరి పిడుగా!' అన్నాడు ఆయన.

'ఈరూపాయినోట్లు చూస్తూంటే మా రామకృష్ణారావు మేష్టారు యివాళ క్లాసులో చెప్పిన లెక్క జ్ఞాపకంవస్తోంది నాన్నా!' అన్నాడు ప్రకాశం.

'అదేమిట్రా, ఏమిటా లెక్క?' అన్నారు ప్రతి విషయంలోనూ కుతూహలం కనబరచే కలక్టరుగారు.

'నువ్వు యిప్పుడు తెచ్చింది వెయ్యేగా, నీ జీతమేనా?'

'అవును ఏం?'

'అమ్మ, అత్త, మామ్మ అందరూ నిన్ను డబ్బిమ్మని పీకుతున్నారుగదూ?'

ఇలాంటి విషయాలు కుర్రాళ్లకి తెలియడం పెద్దాళ్ళకి ఇష్టముండదు. అయినా తెలియకుండా ఉండవు. పేరుకి పడుకున్నా అందరి మాటలూ ప్రకాశం చెవులో పడుతూనే ఉన్నాయి.

'కుర్రాడివి నీకెందుకూ యిలాంటివి, నీ చదువేదో చూసుకోక? అయినా ఈ భోగట్టాతో నీకేం పనీ?'

'అది కాదు నాన్నా, దీనికో మార్గముంది'

'ఏమిటీ?' కలక్టరుగారు అతి ఆశ్చర్యపడుతూ అడిగారు.

'మరేం లేదు. ఎవరికెంత కావాలో వారి కది యిచ్చేయ్' అన్నాడు అతి సీరియస్‌గా.

'అదేమిట్రా?అంటే నీఉద్దేశం?'

'అదిమాత్రం అంత సులువా నాన్నా?' కలక్టరుగారి ఆశ్చర్యాని కంతంలేకపోయింది. వయస్సుకి మించిన తెలివితేటలు ప్రకాశానివి. అర్థమూ, సందర్భమూ లేకుండా వా డెప్పుడూ మాట్లాడడు. అలాంటిది ఇవాళ వాడి మాటలధోరణి ఆయనకేం అర్థం కాలేదు. ఇనప్పెట్టె తాళం వేసి వాడిదగ్గిరగా వచ్చి కూచున్నారు.

'ఏమిట్రా? చేతిలో సొమ్ము ఎవరికేనా పంచిపెట్టడం ఏమంత కష్టం?'

'అది కాదు నాన్నా. నువ్వు చెప్పినంత సులువు కాకపోగా అది ఎలాగో యిప్పటికీ నాకు తెలియలేదు. ఆ పంచడానికి కూడా కొన్ని నిబంధన లున్నాయి మరి. మా మేష్టారు చెప్పిన లెక్క చెప్తాను. జాగ్రత్తగా విను. వెయ్యిరూపాయి లున్నాయిట. అన్నీ రూపాయి నోట్లు. 10 కవర్లు యిచ్చారు. ఆ కవర్లలో యీ వెయ్యీ సర్దాలి. కవర్లు సీలు చెయ్యాలి. సొమ్ము ఎలాగ సర్దాలో తెలుసా? అలా కవర్లలో రూపాయినోట్లు పెట్టేసిన తరవాత 1 నుంచి 1000 రూపాయిలవరకూ ఎవ రెంత అడిగినా ఆ కవర్లలో ఏవో కొన్ని ఆ మొత్తం సరిపోయేటట్టు యివ్వగలగా లన్న మాట. ఇది నీకు సులువేమో గాని నామటుకు కష్టమే.'

'ఏం సులువు? అసలు లెక్క బోధపడ్డమే బలువుగా ఉంటే?'

'పది కవర్లుఉన్నాయి నాన్నా. ఒకటో కవర్లో ఒక రూపాయీ ఆరో కవర్లో 15 రూపాయిలూ పదో కవర్లో 400 రూపాయలూ పెట్టామనుకో. మనకు 16 రూపాయిలు కావలిస్తే ఒకటో కవరూ ఆరో కవరూ తీసుకోవాలన్న మాట. 415 రూపాయిలు కావాలిస్తే? ఆరో కవరూ పదో కవరూ కలిపి తీసుకోవాలి. అలాగ 1 నుంచీ 000 రూపాయిల వరకూ ఏది అడిగినా ఆ పది కవర్లతోనే యివ్వగలగాలన్నమాట. ఏ కవర్లో ఎంత పెట్టాలో చెప్పగలవా నాన్నా?' 1

'అయ్య బాబోయ్ 1 నుంచి 1000 వరకే! దీనికి జవా బసలు ఉందో లేదో'

'ఉందిట. అది చాలా సులువు కూడానట.'

చెప్పే మాటేమిటంటే ఆఖరికి దీనికోసం కలక్టరుగారు బడి పంతుల్ని పట్టుకోవలసివచ్చింది.

మనలో మన మాట. ఏ కవర్లో ఎన్ని రూపాయిలు ఉంచాలంటారు?



## గతవారం సమస్యకు జవాబు

మొత్తం బాతులెన్ని? పన్నెండు. వాటికి వరసగా 1 నుంచి 12 వరకూ పేర్లు పెట్టుకుందాం.

(1) ఒక పళ్లెంలో 1. 2. 3. 4. నంబరు గల బాతులూ, రెండవ పళ్లెంలో 5. 6. 7. 8. నంబరు గల బాతులూ వేసి తూచండి.

దీన్ని 1 2 3 4 × 5 6 7 8 తూచండి అనవచ్చు.

సమానంగా ఉంటే 1 2 3 × 9 10 11 తూచండి. ఇదీ సమానంగా ఉంటే 12 నంబరు గలది దొంగబాతు. దాన్ని ఒక పళ్లెంలో ఉంచి రెండవ పళ్లెంలో మరో బాతు దేన్ని వేసి తూచినా అది తేలికో బరువో తెలిసిపోతుంది.

(2) అలా కాక 1 2 3 × 9 10 11 సమానంగా ఉండక పోతే? 9 × 10 తూచాలి. సమానమైతే 11 దొంగ బాతు. సమానం కాకపోతే అదేదో దాని సంగతేమిటో అక్కడే తేలిపోతుంది.

(3) 1 2 3 4 × 5 6 7 8 తూచినప్పుడు సమానంగా లేక పోతే? 1 2 5 × 3 4 6 తూచండి.

సమానమైతే 7 లేక 8 దొంగ అన్నమాట.

అప్పుడు 1 × 7 తూచండి. సమానమైతే 8 దొంగ. లేకపోతే 7.

(4) 1 2 3 4 × 5 6 7 8 సమానంగా లేక

1 2 5 × 3 4 6 కూడా సమానంగా లేకపోతేనో?

1 × 2 తూచండి.

సమానమైతే 6 దొంగ. లేక పోతే 1, 2 లో ఏదో అక్కడే తెల్సిపోతుంది. లేకపోతే 3 × 4 తూచవచ్చు.

సమానమైతే 5 దొంగ. లేక పోతే 3, 4 లో ఏదో అక్కడే తెల్సిపోతుంది.

ఇందులో-లెక్కకి మూడే కొలతలు గాని, ఇందులో ఎంత ఆలోచనా ఎంత తూనికా ఉందీ!

**[illegible] ఎంతటిదీ!!**

★

మీ రచనని ఎవరూ మెచ్చుకోలేదని మథనపడి, రచన మానుకోనవసరం లేదు. షేక్స్పియర్ అంతటివాణ్ణి మహా మహులనిపించుకున్న రచయితలే చెడ తిట్టివదలి పెట్టారు.

షేక్స్పియర్ రాసినదంతా అసంగతంగా ఉందని గోల్డ్స్మిత్ అన్నాడు. "తప్పతాగిన ఆటవికునివి" అన్నాడు వోల్టెయిర్.

"మనతరం రచయితలలో మహాచెత్త వాళ్ళకన్న కనిష్టం" అని ఆడిపోశాడు డ్రైడెన్.

"తప్పబుట్టిన రాక్షసుడు" అని డేవిడ్ హ్యూమ్ అభివర్ణించాడు. బైరన్ కూడా ఇలాగే [illegible]

## ఆ ఊహే తట్టలేదు!

శాస్త్రవేత్త సర్ ఐజాక్ న్యూటన్ ఒకసారి తనగదిలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. చలి వేసింది. గది మధ్య నెగడులో నిప్పు వేయమని నౌకరుకు చెప్పాడు. నిప్పు బాగా రాజుకునే సరికి వేడికి తట్టుకోలేక పోయాడు. మళ్ళీ నౌకర్ని పిల్చి, "నిప్పులార్పేయ్. అంత వేడి భరించలేను" అన్నాడు.

"బాబూ. మీ కుర్చీ కాస్త ఇవతలకు జరుపుకుంటే సరిపోయేదిగా" అన్నాడు నౌకరు.

"నిజమేస్మీ! ఆ ఊహే తట్టనే లేదు!" అన్నాడు న్యూటన్.

అమెరికన్ తాత్విక రచయిత రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ ఒకసారి ఒక దూడను శాలలో కట్టడానికి తిప్పలు పడసాగాడు. తాడుకట్టి ఎంత ఈడిచినా ససేమిరా అంది దూడ. ఇదంతా చూస్తున్న ఇంటి నౌకరు ఎమర్సన్ను తప్పుకోమన్నాడు తన చూపుడువేలు దూడ నోట్లో పెట్టాడు. దూడ ఆ వేలు చప్పరిస్తూ ఉండగా మెల్లిగా గొడ్ల సావిడికి నడిచాడు. దూడా వెంటనే వెళ్ళింది.

## ★ చివరకు తేలింది ★

(12 వ పేజీ తరువాయి)

నుంచి, గాజుల గలగల వినిపించేసరికి అటు వైపు చూచి నివ్వెరపోయాడు హనుమాన్లు.

అరుగుమీద, దమయంతి నిలిబడివుంది నవ్వుతూ-

హనుమాన్లుకి మతిపోయింది. దమయంతి మళ్ళీ చిరునవ్వు నవ్వి, ఏదో కాగితం చూపి, దొడ్డివైపు రమ్మని సంజ్ఞచేసి యింట్లోకి వెళ్లిపోయింది.

హనుమాన్లు కళ్లు చీకట్లు క్రమ్మాయి-ఇదే మిటి...తను కలగనటం లేదుకదా కొంప తీసి, అనుకుని లేచి, తడబడుతూ దొడ్లోకి వెళ్ళాడు.

అక్కడ వాళ్ల దొడ్లో దమయంతి సన్నజాజి పందిరి ప్రక్కగా నిలబడివుంది. ఏదో కాగితం పట్టుకుని.

హనుమాన్లు యివతలి పిట్టగోడవరకూ వెళ్ళి నిలబడ్డాడు-

హనుమాన్లు గోడదగ్గరకు రాగానే, దమయంతి చేతిలోని కాగితాన్ని యివతలకు విసరివేసి, లేడిపిల్లలా యింట్లోకి వెళ్లిపోయింది.

హనుమాన్లు పులకరించాడు ఒక్కసారిగా. కొన్ని క్షణాలు కదలలేకపోయాడు. పూపొదచాటునుంచి తనంతట తాను వచ్చి పడ్డలేఖ...! ప్రే...మ...లే...ఖ...!

హనుమాన్లు ఎలాగో తేరుకుని, ఆ లేఖను వణుకుతూ తీసి, తొందరగా వచ్చేసి, అరుగు మీద కునికే హరికేన్ లాంతరు వత్తిని పెద్దదిగా చేసి, విప్పాడు ఆ కాగితాన్ని.

శ్రీయుత హనుమాన్లు గార్కి...

మీరు చేసిన సావసాన్ని, నేను అభినందిస్తూన్నాను...! మొదట మీరు నాకు రాసిన, ఉత్తరాల్లోని విషయమంతా కవిత్వమని, వాస్తవానికి దూరమని నాకు తెలుసు. కాదంటారా? మొన్న మీరు ఉక్రోషంతో చేసిన పనికి, మీ మిత్రుడు నెత్తి మీద వేసుకోవాల్సివచ్చింది. ఆ నాడు నిజం తెలియక నేను ప్రవర్తించలేదు. మీ యిద్దరిలో, ఒకరికి ఒకరు చేసే త్యాగం ఎలా వుంటుందోనని అలా చేశాను. ఇందులో మీరు ఓడిపోయారు—మీ మిత్రుడు గెలిచాడు. మీ కోసం, మీకు అపనింద రాకుండా చేసేనిమిత్తం, తను నిర్దోషి అయినా "తప్పు" ఒప్పుకున్నాడు. అయి అప్పుడు మీరు చెయ్యాల్సిన పని ఏమిటంటారు? మీ మిత్రుడు దోషికాదని నిరూపించాలి. గండం తప్పిందే చాలనుకుని, ప్రశాంతంగా ఊరుకున్నారే గాని, ప్రిన్సిపాల్ ఎదుటికి వచ్చి తప్పును ఒప్పుకోలేకపోయారు. ఇంత త్యాగపురుషులైన మీరు నా కోసం ఎన్నో ఎన్నో త్యాగాలు చేస్తానని ఉత్తరాల్లో కవిత్వాలు వ్రాశారేగాని, మీ మిత్రుడి విషయంలో, మీరు వెనకాడినప్పుడు, మీరు వ్రాసిన ఉత్తరాల్లో వాస్తవం శూన్యమంటే మీరు బహుశః ఒప్పకోకపోవచ్చును. నిజంగా ఆనాడు మీ తప్పు ఒప్పుకుంటే నేను మిమ్మల్ని తప్పకుండా వివాహం చేసుకునేదాన్నేమో. అయితే అలా జరుగలేదు—యిది ఎవరి అదృష్టమంటారు?

సరి-యిక ఆ విషయం వదలి వెయ్యండి-దానితో పాటుగా నా విషయం కూడా వదలి వెయ్యండి...!

అన్నట్టు ఒక శుభవార్త!

మీ మిత్రుడు, మీ కోసం సాహసం చేసిన గోపాలాన్ని నేను వివాహం చేసుకోబోతున్నాను—దీనికి మా నాన్న కూడా ఒప్పుకున్నారు. గోపాలం ఒప్పుకోడమే తరువాయి—ఒప్పుకుంటాడనే నమ్మకం నాకుంది.

ఇకనుంచి నన్ను మీ సోదరిగా చూస్తారని ఆశిస్తూన్నాను—మీ ఉత్తరాలు త్రిప్పి పంపేటప్పుడు చేసిన చిలిపిపనికి నన్ను క్షమిస్తారని ఆశిస్తూన్నాను.

సెలవు—దమయంతి."

ఆ లేఖ ముగిసేసరికి హనుమాన్లుకి కళ్లు చీకట్లు క్రమ్మాయి. హరికేన్‌లాంతరు టపటప కొట్టుకొని, ఒక్కసారిగా ఆరిపోయింది.

హనుమాన్లు నిలబడలేక, చేతిలో ఆ లేఖ పట్టుకుని క్రిందకు వాలిపోతుంటే, అప్పుడే అరుగు ఎక్కుతోన్న గోపాలం హడలిపోయి, గాబరాగా వచ్చి పట్టుకున్నాడు హనుమాన్లుని. 






Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



ఇంటికి నీళ్లు

—ఫొటో: ఎ. వి. వి. నరసింగరావు—రాజమండ్రి.

